


C for Clown, for Caramilk. C for Cowb

Cara or Clown, C r Caramilk. C

Cool, amilk. C Clown, C for

mil Cool, C for Car k. C for C

fo milk. C for Cool, C f ramilk.

Cow y, C for Caramilk. C for C , C fo

milk. C for Cowboy, C for Carami C f

for Caramilk. C for Cowboy, C for Caram



Clown, or Caramilk. C for Cowboy, C

milk. Clown, C for Caramilk. C for




for C C for Clown, aramil

Cool, Caramilk. n, C for

milk. f Cool, C for C milk. C for C

for rami . C for Cool,

Cowboy, C for Caramilk.




HTA 8194.

ఆడుతూ పాడుతూ నవ్విస్తూ కవ్విస్తూ హాయిగా సాగే సర్వజన రంజనం



చందమామ విజయా కంబైన్స్ వారి



నాగిరెడ్డి - చక్రపాణి ఆశీస్సులతో

# బృందావనం

సింగీతం శ్రీనివాసరావు

MA CHANDAMAMA CHANDAMAMA CHA

డి.వి.నరసరాజు

నిర్మాత
బి.వెంకట్రామిరెడ్డి

మాధవపెద్ది సురేష్

## చందాదారులకు గమనిక!

చందమామకు వేలకొలది చందాదారులు ఉన్నారు. కాబట్టి, కవర్ల మీద చిరునామా సిద్ధం చేయడం మొదలైనవన్నీ ప్రతినెలా మొదటివారంలోనే పూర్తి చేయవలసి ఉంటుంది. పత్రిక మీకు ఆలస్యం కాకుండా సకాలంలో అందాలంటే మీ చిరునామాలో మార్పులేమైనా వుంటే వెంటనే మాకు తెలియపరచడం చాలా అవసరం. ఈ విషయంలో మాతో సహకరించాలని కోరుతున్నాము.

డాల్టన్ ఏజన్సీస్
సబ్‌స్క్రిప్షన్ సెక్షన్
చందమామ బిల్డింగ్స్
మద్రాసు – 600 026




'మేగీ జిగ్సా పజిల్'లో
మేగీ సాహసమయ ప్రపంచం
సమకూర్చుకోండి.



మేఘాలలో తేలిపొండి! 'మేగీ స్కై
ఫ్లైజర్'లో





మేగీ 'ఏస్ ఎడ్వెంచరర్స్ గేమ్'లో
సముద్రం నుండి ఆకాశం వరకూ
యాత్రను పూర్తి చేయండి.

మేగీ 'హూ-డున్-ఇట్ మిస్టరీ'
గేములో దొంగను పట్టుకోండి.

# సరదా ప్రియులకు అద్భుత సాహస యాత్రలు!

## మేగీ క్లబ్ సభ్యులకు ఉచిత బహుమతులు!

ఇతర గ్రహవాసుల చతురతతో
తలపడండి-మీ తెలివితేటలతో 'మేగీ
రెయిడర్స్ ఆఫ్ ది రెడ్ స్టార్' గేములో



ఉచిత మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్.
మీరు పొందే ప్రతి 2 బహుమతులతో ఒక మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్ ఉచితం.

ఏయ్! పిల్లలూ! మేగీక్లబ్‌లో చేరి మేగీ సాహస
ప్రపంచంలో ప్రవేశించండి!

మీరు మేగీ నూడుల్స్ యొక్క ఐదు ఖాళీ సంచులకు
ముందు వైపున ఉండే ఈ ను కత్తిరించి మీరు
ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం మాకు పంపించండి.
అంతే! మీకు 6 నుండి 8 వారాలలో మేగీ క్లబ్ నుండి ఎంతో
వినోదాన్నీ ఉత్సాహాన్నీ కలిగించే బహుమతి అందుతుంది.

గుర్తుంచుకోండి! మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు
కావలసిన బహుమతితోబాటు మీ పేరు, చిరునామా,
మీరు పుట్టిన తేదీని పంపండి. ఈపరికే మీరు మేగీ క్లబ్
సభ్యులైతే మీ సభ్యత్వపు నంబరు పంపండి. ఒకవేళ మీరు
మేగీ క్లబ్బర్ కాని పక్షంలో మేగీ క్లబ్ సభ్యత్వం పొందటానికిది
సదవకాశం. పై వివరాలు పంపేటప్పుడు సభ్యత్వం కూడా
కావాలని వ్రాయండి. మేము మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డును
మీ బహుమతితో బాటు ఉచితంగా పంపుతాము.




మా చిరునామా:

**MAGGI CLUB**
P.O. Box 5788 New Delhi-110 055




మరొక సదుపాయం కూడా! ఈ సరికి మీరు మీ మేగీ బర్డ్ హౌస్‌ను సేకరించనట్టయితే ఇపుడే సేకరించండి!

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## బాలల భవిష్యత్తు

భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినం నవంబర్ 14 వ తేదీని మనం బాలలదినంగా పాటిస్తున్నాము. బాలబాలికలపట్ల జవహర్‌లాల్ కనబరచిన ప్రేమాభిమానాలు, వారి భవిష్యత్తుపట్ల ఆయన చూపిన శ్రద్ధాసక్తులు అందరికీ, ముఖ్యంగా వర్ధమాన దేశాలన్నిటికీ ఆదర్శప్రాయమైనవి.

భారతదేశంతో సహా, దక్షిణ ఆసియాలోని ఏడు దేశాలమధ్య ప్రాంతీయ సహకారానికి ఏర్పాటు చేయబడిన సంస్థ 'సార్క్.' దక్షిణాసియా బాలల భవిష్యత్తును గురించి చర్చించడానికి ఇటీవల కొలంబోలో జరిగిన సార్క్ మంత్రుల సమావేశంలో ఒక 'చార్టర్'ను రూపొందించారు.

పద్దెనిమిది సంవత్సరాలకు లోబడిన బాలబాలికలందరికీ జాతి, మత, ప్రాంతీయ భేదాలు పాటించకుండా రక్షణ కల్పించాలి. పిల్లలకు ఆకలిబాధ, అనారోగ్యం లేకుండా చేసి అవసరమైన విద్యావకాశాలు కల్పించి, బాలల భవిష్యత్తును ప్రకాశవంతం చేయడానికి పెద్దలు కృషిచేయాలని ఈ చార్టర్ కోరింది.

1986 వ సం॥ లో బెంగుళూరులో జరిగిన 'సార్క్' సమావేశంలోనే మొట్ట మొదట, పిల్లల భద్రత, భవిష్యత్తుపట్ల ప్రపంచం దృష్టిని ఆకర్షించాలని తీర్మానించడం జరిగింది. దాని పర్యవసానంగానే బాలల హక్కుల పరిరక్షణగురించి పరిశీలించడానికీ, చర్చించడానికి 1989.వ సం॥లోనూ, 1990 వ సం॥లోనూ ఐక్యరాజ్య సమితి ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేసింది.

రియోడిజనీరోలో గత జూన్‌మాసంలో జరిగిన 170 దేశాలు పాల్గొన్న భూ పరిరక్షణ సమావేశంలో కూడా వాతావరణ కాలుష్యంవల్ల పిల్లలకు వచ్చే వ్యాధులూ, కలిగే ఆహారలోపాలూ, వాటిల్లే శిశుమరణాలూ మొదలైనవాటిని గురించి హెచ్చరిస్తూ, పిల్లలపట్ల హింస ప్రదర్శించడాన్ని తీవ్రంగా ఖండించారు. ప్రస్తుతం 'సార్క్' తరఫున ప్రత్యేకమైన చార్టర్ వెలువడింది.

మొత్తంమీద ఈ సభలూ, సమావేశాలూ అన్నీ జీవితంలో బాల్యదశ చాలా అమూల్యమైనదనీ, దానిని హాయిగా గడిపేహక్కును బాలబాలికలందరికీ కల్పించడం పెద్దల బాధ్యతఅనీ గుర్తుచేస్తున్నాయి.

సంపుటి 90 నవంబర్ '92 సంచిక 5

విడి ప్రతి : 4-00 ః సంవత్సర చందా : 48-00

# పాడుదాం తీయగా క్యాంప్కో పాట!

పాలు మీగడ నిండినది. కమ్మని కలలా రుచికరమైనది.

ఇది నాకు నచ్చిన చక్కని చాక్లెట్. క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.

భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి,
క్యాంప్కో లిమిటెడ్, మంగుళూరు.




R K SWAMY/BBDO CL 10117 TL

# సంయుక్త ఐరోపా దేశాలకోసం




1957వ సం॥లో కొన్ని ఐరోపాదేశాలు "యూరోపియన్ ఎకనామిక్ కమ్యూనిటీ" (ఇ.ఇ.సి) పేరుతో ఒకటిగా చేరాయి. వాటినే ఇంతవరకు 'కామన్ మార్కెట్' అని కూడా పిలిచేవారు.

ఇప్పుడుఆసంస్థపేరును'యూరోపియన్ యూనియన్'గా మార్చడానికి యూరపు దేశాలు ప్రయత్నిస్తున్నాయి.

మొట్టమొదట బెల్జియం, ఫ్రాన్స్, ఇటలీ, లక్సెంబర్గ్, నెదర్లాండ్స్, పశ్చిమ జర్మనీ దేశాలు కలిసి ఒక 'ఆర్థిక సమాఖ్య'ను ఏర్పాటు చేశాయి. 1973వ సం॥లో మరో ఆరు దేశాలు డెన్మార్క్, ఐర్లాండ్, గ్రీసు, స్పెయిన్, పోర్చుగల్, ఇంగ్లాండు ఈ సమాఖ్యలో చేరాయి. 1991వ సం॥ డిసెంబర్ నెలలో ఈ

పన్నెండు దేశాల విదేశాంగ మంత్రులు నెదర్లాండులోని మాస్ట్రిక్ట్‌లో సమావేశమై 'యూరోపియన్ యూనియన్ ట్రిటీ' పైన ఒక అంగీకారానికి వచ్చారు. రెండు నెలల తరవాత ఆ దేశాల నేతలు ఈ ఒప్పందంలో సంతకాలు చేశారు.

ఈ ఒప్పందపత్రం రూపొందించడానికి కొన్ని చారిత్రక కారణాలు ఉన్నాయి. ముఖ్యంగా, ప్రపంచంలో అగ్రదేశాలుగా ఉన్న అమెరికా, సోవియట్ యూనియన్ల మధ్యసాగిన ప్రచ్ఛన్నయుద్ధం, సోవియట్ యూనియన్ విచ్ఛిత్తితో సమసిపోయింది. ప్రస్తుతం అమెరికా మాత్రమే 'సూపర్ పవర్'గా మిగిలింది. దాని ధాటికి తట్టుకోవాలంటే ఐరోపాదేశాలన్నీ సమైక్యశక్తిగా ఏర్పడవలసిన అవసరాన్ని ఆయాదేశాలు గుర్తించాయి.

ఈ ఒప్పందపత్రంలోని ముఖ్యమైన అంశాలు ఇవి: 'యూనియన్' దేశాల మధ్య ప్రజల రాకపోకలకు, సరకుల రవాణాకు అంతరాయం ఉండకుండా

> అస్ట్రేలియాకు తరవాత అతి చిన్న ఖండం ఐరోపా. భౌగోళికంగా ఆసియా ఖండానికి అనుకుని ఉన్న ఐరోపా ఖండాన్ని క్రీ.పూ. 5వ శతాబ్దంలో అస్సీరియన్లు మొట్టమొదట వేరు పరిచారు. ఆసియాఖండాన్ని ఉదయ సూర్యుడిభూమిగానూ, ఐరోపాఖండాన్ని సూర్యాస్తమయ భూమిగానూ వర్ణించారు.

ఆంతరంగిక సరిహద్దులను తొలగించాలి. ఈ ఒప్పందం 1993వ సం॥ జనవరి ఒకటవ తేదీ అమలులోకి వస్తుంది. మరొక సంవత్సరంలో 'యూరోపియన్ ఆర్థిక సంస్థ' ఏర్పడుతుంది. ఇది 1997వ సం॥ ఏర్పడనున్న 'యూరోపియన్ సెంట్రల్ బ్యాంక్'కు దోహదం చేస్తుంది. ఈ శతాబ్దం పూర్తయ్యేలోగా ఒకే విధమైన ద్రవ్య విధానం అంటే 'కామన్ యూరోపియన్ కరెన్సీ' అమలులోకి వస్తుంది. ఈ యూనియన్ – విద్య, సంస్కృతి, ఆరోగ్యం, పరిశ్రమలు, వినియోగదారుల రక్షణ, పర్యావరణ పరిరక్షణ, రవాణా, కమ్యూనికేషన్స్ మొదలైన వాటి అభివృద్ధికి కృషి చేస్తూ, ఒకే విధమైన విదేశాంగ విధానాన్ని రూపొందించడానికి ప్రయత్నిస్తుంది. యూరోపియన్ పార్లమెంటు ఏర్పడుతుంది. మొత్తం మీద ఈ 190 పేజీల ఒప్పందపత్రాన్ని 'ఐరోపా సంయుక్తరాష్ట్రాలు'ఏర్పడడానికి దోహదం చేసే ఒప్పందపత్రంగా చెప్పవచ్చు.

ఈ ఒప్పందపత్రం ఆమోదానికి వచ్చినప్పుడు డెన్మార్క్ నిరాకరించింది. గ్రీకు పార్లమెంటు అత్యధిక మెజారిటీతో ఆమోదించింది. ఫ్రాన్స్‌లో 51శాతం ఆమోదం, 49 శాతం నిరాదరణ ఎదురయింది. లక్సెంబర్గ్, నెదర్లాండ్స్ కూడా ఒప్పందానికి మద్దతు తెలియజేశాయి. ఈ సంవత్సరాంతంలోపల మిగతా ఏడుదేశాల నిర్ణయం కోసం ఎదురు చూస్తున్నారు.



# శివుడి ప్రయాణం

శివుడనేవాడికి అయిదేళ్ళ వయసులోనే తల్లీ, తండ్రీ చనిపోయారు. ఒంటరివాడైన శివుణ్ణి రాఘవయ్య అనే గృహస్థు చేరదీసి పెంచాడు. చిన్నతనం నుంచీ శివుడు సోమరిగా ఉండేవాడు. వాడికి చదువు సంధ్యలు అబ్బలేదు. పనిపాటులు తెలియలేదు. అలాగే వాడికి పదహారేళ్ళొచ్చాయి.

ఒకరోజు రాఘవయ్య వాణ్ణి పిలిచి, "ఒరేయ్! నువ్వు సోమరివైనావని అంతా నన్నే తప్పు పడుతున్నారు. నేనిప్పుడు ముసలివాణ్ణయ్యాను. పని చేయందే నా పిల్లలు నీకు తిండి పెట్టరు. ఈరోజు నుంచీ నువ్వు రెండు పూటలా పెరట్లో మొక్కలకు నీళ్ళు పోస్తూండు," అని చెప్పాడు.

రాఘవయ్య పెరడు చాలా పెద్దది. అందులో ఫలవృక్షాలతోపాటు, రకరకాల పూలమొక్కలు, కూరగాయల మొక్కలు, పాదులు, మళ్ళు ఉన్నాయి. అన్నీ తడపాలంటే పూటకు కనీసం రెండు గంటలసేపు పడుతుంది. శివుడికాపని చాలా కష్టంగా తోచింది. కానీ రాఘవయ్య వాడితో, పెరడు తడిస్తేనే తిండి పెడతానన్నాడు. కష్టపడకుండా పెరడు తడిపే మార్గమేదైనా తెలుసుకోవాలని తీవ్రంగా ఆలోచించి, వాడిల్లు వదిలి ఊరు చివర కొండగుహలోని బైరాగిని కలుసుకున్నాడు.

వాడు చెప్పినదంతా విని బైరాగి, "కష్టపడకుండా, నేల తడవాలంటే వాన పడాలి. కోరినప్పుడల్లా వాన పడాలంటే యోగసాధన చేయాలి. అందుకు నువ్వు ఇక్కడికి ఈశాన్యదిశలో ఉన్న అడవికి వెళ్ళి, ఒక మర్రిచెట్టుకు తలక్రిందులుగా వేళ్ళాడుతూ ఆరు మాసాలు తపస్సు

వసుంధర



చేయాలి. అప్పుడు నీకు సిద్ధులువస్తాయి." అన్నాడు.

శివుడు వెంటనే ఈశాన్యదిశగా వెళ్ళాడు. అడవిలో కొంతదూరం ప్రయాణం చేయగానే వాడికి ఒక చెట్టు కొమ్మకు తలక్రిందులుగా వేళ్ళాడుతున్న మనిషి కనిపించాడు.

శివుడు అతడి దగ్గిరకుపోయి వినయంగా, "నేను కూడా ఇక్కడే మీలాగా వ్రేలాడుతాను. మనం తోడుగా తపస్సు చేసుకుని సిద్ధులు పొందవచ్చు." అని అన్నాడు.

దానికామనిషి చిరాగ్గా, "తపస్సేమిటి? సిద్ధులు ఏమిటి? నన్ను కొందరు మనుషులిలా వ్రేలాడదీశారు. ముందు నువ్వు చెట్టెక్కి నాకట్లు విప్పు. తరవాత మిగతా విషయాలు వివరంగా మాట్లాడుకుందాం." అన్నాడు.

శివుడు అలాగేచేసి, వాడొక దొంగ అని తెలుసుకుని, "నువ్వు నానాకష్టాలుపడి దొంగతనాలు చేసే బదులు, ఇలా ఆరు నెలలు తపస్సు చేసి సుఖంగా బ్రతకవచ్చుగా!" అంటూ బైరాగి చెప్పింది చెప్పాడు.

దొంగ, శివుడితో, "నేను పట్టుబడడం వల్ల నన్నిలా కట్టేశారు. ఒక గంటపాటిలా వ్రేలాడుతూనే బాధభరించలేకపోయాను. ఆరు నెలలిలా వుండడం నావల్లకాదు. నీకిష్టమైతే చెప్పు. ఇప్పుడే నిన్ను వ్రేలాడతీస్తాను. లేదా, నాతో రా! దొంగతనాలు ఎలా చేయాలో చక్కగా నేర్పుతాను. నువ్వు చెప్పిన తపస్సుకంటే, నా దొంగతనాలే సుఖంగా ఉంటాయి. పైగా ఒకరికొకరు తోడుంటే, ఇలాంటి సమయాల్లో హాయిగా కట్లు విడిపించుకోవచ్చు." అన్నాడు.

ఈ మాటలు శివుడికి నచ్చాయి. వాడు దొంగతో బయల్దేరి వెళ్ళాడు. ఆ రాత్రి దొంగ వాణ్ణి శుభ్రంగా స్నానం చేయమన్నాడు. తరవాత ఒంటినిండా నూనె రాసుకోమన్నాడు. నల్లరంగు పూసుకో

మన్నాడు. అప్పుడు ఇద్దరూ దొంగతనానికి బయల్దేరారు.

ఇద్దరూ ఊరుచేరాక, శివుడు ఒక పెద్ద భవనం చూపించి, "ఇందులోకి వెళదాం ఎక్కువ డబ్బులు దొరుకుతాయి," అని అన్నాడు.

దొంగ తల అడ్డంగా ఊపి, "ఇలాంటి పెద్ద పెద్ద ఇళ్ళల్లో కాపలామనుషులు, వుంటారు. వేటకుక్కలు ఉంటాయి. తక్కువ డబ్బు దొరికినా, మనం దొంగ తనానికి చిన్న ఇళ్ళకే వెళ్ళాలి!" అని పాఠం చెప్పాడు.

ఒక ఇంట్లో వాళ్ళకు రెండువందల వరహాలు దొరికాయి. శివుడు సంతోషపడి, "ఈ డబ్బు మనిద్దరం పంచుకుంటే, నెల రోజులపాటు శ్రమపడక్కరలేదు," అని అన్నాడు.

దొంగ తల అడ్డంగా ఊపి, "ఏ ఇంటికి కాపలా ఉండదో మనకు రహస్యంగా సమాచారం అందించే మనిషి ఒక డున్నాడు. వాడికి మనం యాభైవరహాలిచ్చు కోవాలి. ఈ వీధికి కాపలావుండే రాజ భటుడు, మనం వస్తూవుండడం తెలిసీ మనను చూడనట్లు నటించాడు. అందుకు వాడికొక యాభై వరహాలిచ్చుకోవాలి. ఈ ఇంట్లో దొంగతనం చేయటానికి అనుమ తించినందుకు దొంగలనాయకుడికి యాభై



వరహాలిచ్చుకోవాలి. మిగిలిన డబ్బును మనం చెరిసమంగా పంచుకుని, గుడికి వెళ్ళి చెరొక పది వరహాలూ అమ్మవారికి కానుకగా ఇవ్వాలి. ఇకపోతే మనకు మిగి లేది మనిషికి పదిహేను వరహాలు!" అన్నాడు.

శివుడు దానికి ఎంతో సంతోషించాడు. కానీ తను ఇల్లుచేరాక వాడు వంటికి పట్టించిన నల్ల రంగునూ, నూనె జిడ్డునూ వదిలించుకునేందుకు సున్ని పిండి, కుంకుడుకాయలు పెట్టి వళ్ళంతా శుభ్రంగా తోముకునేందుకు రెండు గంటలసేపు పట్టింది. దొంగతనం చేసి వచ్చినప్పుడల్లా అలా చేయాలంటే వాడికి



బెంగ పట్టుకున్నది. ఏ శ్రమా లేకుండా వీధికాపలా పేరుచెప్పి ఒక మూల పడు కుంటూ, దొంగల దగ్గిర లంచాలు తినే రాజభటుడి జీవితం వాడికి సుఖమని పించింది.

అందువల్ల శివుడు మర్నాడు భటుడి వద్దకు వెళ్ళి, తనకూ అలాంటి ఉద్యోగం కావాలన్నాడు. రాజభటుడు వాడితో, "కొత్వాలు నాచేత ఇంటిచాకిరీ అంతా చేయించుకుంటాడు. అందుకే నేను బాధ్యత సరిగా నిర్వహించకపోయినా ఏమీ అనడు. నాకు లంచాలవల్ల బోలెడు ఆదాయం వస్తున్నది. కొత్వాలు ఇంట్లో నా చాకిరీ అంతా చేస్తానంటే, నేను నీకు రెండు వందల వరహాలిస్తాను. చేస్తావా?" అన్నాడు.

"చాకిరీ నావల్లకాదు. నేను కొత్వాలునే అవుతాను. అందుకేం చేయాలి?" అని అడిగాడు శివుడు.

"కొత్వాలువు కాదలిస్తే, ఈ ఊళ్ళో చంద్రనాధుడనే శిక్షకుడున్నాడు. ఆయన వద్దకు వెళ్ళు." అని సలహా ఇచ్చాడు రాజభటుడు.

శివుడు చంద్రనాధుడి వద్దకు వెళ్ళాడు. ఆయన వద్ద రెండు వందలమంది శిష్యులున్నారు. ఆయన శివుడి కోరిక విని, "కొత్వాలు అంటే దొంగలను పట్టుకోగలగాలి. అందుకు బలం, తెలివి, చురుకుతనం అన్నీ వుండాలి. రెండు సంవత్సరాలపాటు ఏకాగ్రతతో అహోరాత్రులు నావద్ద విద్యాభ్యాసం చేస్తే కొత్వాలుగానీ, అందుకు సమానమైన పదవికానీ, నీకు తప్పక లభించగలదు," అన్నాడు.

అక్కడి పరిస్థితులన్నీ పరిశీలనగా చూశాక శివుడు, "ఇంత శ్రమ పడడం నావల్ల కాదు. నేనుశిష్యుణ్ణికాక, మీలాగా శిక్షకుడినవుతాను, అందుకేం చేయాలి?" అని అడిగాడు.

"శిక్షకుడివి కావాలంటే, అందుకు నాలుగు సంవత్సరాలపాటు ఏకాగ్రతతో

విద్యాభ్యాసం చేయాలి," అన్నాడు చంద్రనాధుడు.

శివుడు కొంచెంసేపు ఆలోచించి, చంద్రనాధుడికి వినయంగా నమస్కరించి, "అయ్యా! తమరెంతో చదువుకున్నారు. శ్రమపడకుండా డబ్బు సంపాయించే మార్గం చెప్పలేరా?" అన్నాడు.

చంద్రనాధుడు వాడివంక జాలిగా చూసి, "నీకోరిక న్యాయమైనది కాదు. కానీ, తీరేమార్గం ఒకటున్నది. ఈఊళ్ళో దేవయ్య అనే భాగ్యవంతుడున్నాడు. ఆయనవద్ద ఓపిగ్గా కూర్చుని ఉదయం రెండు గంటలూ, సాయంత్రం రెండు గంటలూ కథలు చెబితే, నీకు రోజుకు అయిదు వరహాలిస్తాడు. వెళ్ళు!" అన్నాడు.

శివుడు, వెంటనే వెళ్ళి దేవయ్యను కలుసుకున్నాడు.

దేవయ్యది చాలా భారీ శరీరం. పెద్ద గదిలో పట్టెమంచంమీద పిప్పిళ్ళబస్తాలా పడుకుని వున్నాడాయన. శివుడు చెప్పిన కథలు ఆయనకు నచ్చాయి. తన ఉద్యోగమూ శివుడికి నచ్చింది.

ఒకరోజు శివుడాయనతో, "నే నెదురు చూసిన అవకాశం వచ్చింది. ఇక నేను శాశ్వతంగా మీవద్దనే స్థిరపడిపోతాను," అన్నాడు సంతోషంగా.



దేవయ్య అదోలా నవ్వి, "నాకూ నీ కథలు నచ్చాయి. కానీ ఎల్లకాలం ఇలా సాగదు!" అన్నాడు.

"ఎందుకని? మీదగ్గిర డబ్బులయిపోవచ్చాయా?" అనడిగాడు శివుడు.

ఆ ప్రశ్నకు దేవయ్య పెద్దగా నవ్వి, "కూర్చుని తిన్నా అయిదు తరాలదాకా తరగని ఆస్తి నాది! నాకు డబ్బు సమస్యే లేదు. కానీ, చిన్నతనం నుంచీ సోమరినై ఏ పనీ చేయకుండా వుండడంవల్ల, నేనిలా మహాకాయుడనై, నా వళ్ళు నాకే బరువనిపించేలా ఉన్నాను. ఇందువల్ల నాకెన్నో రోగాలు. వైద్యుడు వచ్చి నాకు మందులిస్తున్నాడు. కొంత బరువు తగ్గితేకానీ ఏ

మందులూ పనిచేయవని ఆయనచెప్పాడు. బరువు తగ్గడం కోసం తిండి తగ్గించి, ద్రవపదార్థాలే పుచ్చుకుంటూ ఆకలిని మరచిపోవటానికి, నీ చేత కథలు చెప్పించుకుంటున్నాను. కాస్త బరువు తగ్గితే వైద్యుడు, కొత్తవైద్యం మొదలు పెడతానన్నాడు. అది మొదలుపెడితే నీ కథలు వినడానికి వీలుండదు," అని అన్నాడు.

"ఎందుకు వీలుండదు?" అన్నాడు శివుడు.

దానికి దేవయ్య చిన్నగా మూలిగి, "ఇప్పుడు నాకు మంచందిగి నడవాలంటేనే కష్టంగా ఉంది. కాస్త బరువు తగ్గితే లేచి నడవగలుగుతాను. అప్పుడు రోజూ ఉదయం రెండు గంటలూ, సాయంత్రం రెండు గంటలూ, నేను ఇంటి పెరట్లో మొక్కలకు నీళ్ళు పోస్తూండాలి. అదే కొత్తవైద్యం. ఈవైద్యం వల్ల నాకు వారం పదిరోజుల్లోనే ఒళ్ళు తేలికపడుతుందట. ఈవైద్యం మాననంత కాలం, నా ఆరోగ్యానికి ఎటువంటి చిక్కూ ఉండదంటున్నాడు వైద్యుడు," అన్నాడు.

వెంటనే శివుడు ఆశ్చర్యంగా, "రెండు పూటలా మొక్కలకు నీళ్ళుపోయడమా? అబ్బా, ఎంత శ్రమ! ఎంత కష్టం!" అన్నాడు.

"అంత శ్రమ పడకపోవడంవల్లనే, ఇప్పుడు ముప్పొద్దులా మంచం మీదే వుండి, ఆరోగ్యం లేక బాధపడుతున్నాను. అనారోగ్యంతో బాధపడుతూ కూర్చోవడం కంటే, శ్రమపడుతూ ఆరోగ్యంగా వుండడమే మంచిది కదా!" అన్నాడు దేవయ్య.

ఆ జవాబుతో శివుడికి జ్ఞానోదయమైంది. వాడు దేవయ్య అవసరం తీరేదాకా అక్కడ వుండి, తరవాత తనను పెంచి పెద్దచేసిన రాఘవయ్య ఇంటికే వెళ్ళి, ఆయన చెప్పినవన్నీ చేస్తూ పనిమంతుడని పేరుపొంది కలకాలం సుఖంగా జీవించాడు.






[యువరాణి విద్యావతిని కనుగొనడానికి బయలుదేరిన మహేంద్రనాధుడికి అరణ్యమధ్యంలో ఒక సన్యాసి కనిపించి మహిమ గల ఉంగరాన్ని ప్రసాదించాడు. అక్కడినుంచి ప్రయాణం కొనసాగించిన మహేంద్రనాధుడికి కొండమీద ఒక బ్రహ్మాండమైన భవనం కనిపించింది. ఆ భవన ద్వారపాలకుడు ఆ రాత్రి అక్కడే గడపటానికి అతనికి ఆశ్రయమిచ్చాడు.—తరవాత]

ఆ రాత్రి చాలా సేపు రకరకాల ఆలోచనలతో గడిపిన మహేంద్రనాధుడికి, మార్గ మధ్యంలో కనిపించిన సన్యాసి గుర్తుకు రాగానే, ఆయన ఇచ్చిన ఉంగరాన్ని ఒక సారి తాకి చూసుకున్నాడు. అర్ధరాత్రి దాటిన తరవాత అలాగే నిద్రపోయాడు. తెల్లవారుతూ ఉండగా మేలుకుని లేచి కూర్చున్నాడు. చుట్టుపక్కల ఒకే హడావుడిగా ఉన్నది. అంతలోనే ద్వారపాలకుడు రెండు పళ్ళాలనిండా ఆహారం తెచ్చి మహేంద్రనాధుడి ముందుంచాడు. ఇద్దరూ కలిసి భోజనం చేసి చేతులు కడుక్కుంటున్నప్పుడు, మహేంద్రనాధుడు, "మీ యజమాని వచ్చాడు కదా?" అని అడిగాడు.

ద్వారపాలకుడు ఆశ్చర్యంతో కనుబొమలు పైకెత్తి, "ఆ సంగతి నీకెలా తెలిసింది?" అని అడిగాడు.



"రాత్రి నిద్రపోతుండగా ద్వారం గొలుసులను ఎవరో కదిలించడం లీలగా విన్నాను. ఇప్పుడు ఎక్కడ చూసినా ఒకే హడావుడిగా ఉన్నది కదా? ఆ కారణం గానే మీ యజమాని వచ్చాడని ఊహించాను," అన్నాడు మహేంద్రనాధుడు.

అవునన్నట్టు తల ఊపాడు ద్వారపాలకుడు.

"ఇకపైన నేను ఇక్కడ ఉండడం నీకుకష్టం కలిగించవచ్చు. నేనిక బయలు దేరతాను," అన్నాడు మహేంద్రనాధుడు.

"మా యజమాని వచ్చినమాట నిజమే కాని, అయన ఇటువైపు రానే రాడు. కాబట్టి నువ్వేమీ తొందరపడనవసరం లేదు. ఇక్కడ ఒకటి రెండు రోజులు విశ్రాంతి తీసుకుని నీ ప్రయాణం కొన సాగించవచ్చు. ఈలోగా ఇక్కడే ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమో ప్రయత్నించి చూస్తాను," అన్నాడు ద్వారపాలకుడు.

"నీ ఉపకారం మరువరానిది. మీ యజమాని కనికరించి నాకేదైనా ఉద్యోగం ఇస్తే ఇక్కడే మరికొన్నాళ్ళు గడుపుతాను. లేదా నీకు ఏమాత్రం ఇబ్బంది కలిగించ కుండా రేపే నా ప్రయాణం కొనసాగిస్తాను," అన్నాడు మహేంద్రనాధుడు.

"ఆ సంగతి నాకు వదిలి, నువ్వు నిశ్చింతగా విశ్రాంతి తీసుకో. తగిన సమయం చూసి మా యజమానిని కలుసుకుని, నీ ఉద్యోగం సంగతి అడుగుతాను," అనిచెప్పి ద్వారపాలకుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

మహేంద్రనాధుడు ఆ గదిలోనే కూర్చుని, ఒక కిటికీగుండా వెలుపలికి చూడసాగాడు. అక్కడి వాతావరణాన్ని చూడగానే మెరుపులా అతనికొక ఆలోచన వచ్చింది. హడావుడిగా పనులు చేసుకుంటూన్న సేవకులతో తనూ కలిసిపోయినట్టయితే, భవనం వెలుపలా, లోపలా పరిశీలించి చూసే అవకాశం లభిస్తుంది. అలాగే ద్వారపాలకుడు చెప్పిన కొత్తగా వచ్చిన ముఖ్యమైన స్త్రీ ఎవరో తెలుసుకో

పచ్చు. వెంటనే మహేంద్రనాధుడు అక్కడున్న ఒక బట్టను తీసి తలకు చుట్టుకుని గుట్టుచప్పుడు కాకుండా సేవకుల మధ్యకు వెళ్ళిపోయాడు. సేవకులందరూ వారివారి పనులలో నిమగ్నులై ఉన్నారు. కొందరు ఉద్యానవనంలోని అందమైన విగ్రహాలను తుడుస్తున్నారు. మరికొందరు మొక్కలకు నీళ్ళు పడుతున్నారు; వాటిని అందంగా తీర్చిదిద్దుతున్నారు. ఇంకా కొందరు భవనం కిటికీలను, తలుపులను తుడుస్తున్నారు. ఒక్కరుకూడా మహేంద్రనాధుణ్ణి గుర్తించలేదు. అతడు కొంతసేపు ఉద్యానవనంలో పనిచేసి, మెల్లగా భవనాన్ని సమీపించాడు. కిటికీలనూ, తలుపులనూ తుడుస్తూ భవనంలోపలికి వెళ్ళాడు. భవనం గదులన్నీ శుభ్రంగానూ, ఖాళీగానూ ఉన్నాయి. కొన్ని గదుల తలుపులు మూసి ఉన్నాయి. కిటికీలగుండా లోపలికి తొంగిచూశాడు. లోపల గోడలకు నిలువుటద్దాలు అమర్చబడి ఉన్నాయి. వాటితో పాటు అక్కడక్కడా రకరకాల అద్దాలు చిన్నవీ పెద్దవీ చాలా కనిపించాయి.

మహేంద్రనాధుడు కొంతసేపు అలా పరిశీలించి చూసి, పక్కన ఒక చిన్న మార్గం కనిపించగానే అటుకేసి వెళ్ళి, తలుపులు సగం తెరుచుకుని ఉన్న ఒక గదిని సమీపించాడు. ఆ తలుపులను తెరచుకుని లోపలికి అడుగుపెట్టాడు. విశాలమైన ఆ గదినిండా నిలువుటద్దాలు ఉన్నాయి. ఒకవైపున చక్కని దేవీ





నందుకు క్షమించండి. తరవాత వచ్చి, శుభ్రం చేస్తాను," అంటూ మహేంద్ర నాధుడు ఆయనకు వంగి నమస్కరించి అడుగు వెనక్కు వేశాడు.

"ఈ గది శుభ్రంగానే ఉన్నది. నువ్వేమీ శుభ్రం చేయనవసరంలేదు. వెళ్ళు!" అన్నాడు వృద్ధపండితుడు.

"చిత్తం, స్వామీ!" అని మహేంద్ర నాధుడు ఆయనకు మరొకసారి వినయంగా నమస్కరించి, వెనుదిరిగి గదినుంచి వెలుపలికి వచ్చాడు.

మహేంద్రనాధుడు వేగంగా ద్వార పాలకుడి గదిని చేరుకున్నాడు. కొంత సేపటికి ద్వారపాలకుడు, "బాగా విశ్రాంతి తీసుకున్నావా?" అంటూ లోపలికి అడుగుపెట్టాడు.

"ఆం, ఈ చుట్టుపక్కల సేవకులు హడావుడిగా పనులు చేసుకుంటున్నారు. వాళ్ళను చూస్తూ కూర్చున్నాను. పొద్దు పోయిందే తెలియలేదు. నువ్వు మీ యజ మానిని చూశావా?" అని అడిగాడు మహేంద్రనాధుడు.

"మా యజమాని ఈసారి ఒంటరిగా రాలేదు. మరొక ముగ్గురు పెద్దలను వెంట బెట్టుకుని వచ్చాడు. వాళ్ళు జ్యోతిష్కులు లాగా ఉన్నారు. వాళ్ళతో కలిసి మధ్యాన్నం భోజనం చేశాక మా యజ

విగ్రహం కనిపించింది. ఆ విగ్రహానికి సమీపంలో పట్టుకంబళి పరచిన నేలమీద ముగ్గురు వృద్ధపండితులు కూర్చుని ఉన్నారు. ముగ్గురూ ఒకేవిధమైన కాషా యాంబరాలు ధరించి ఉన్నారు. ఇద్దరు ఏవో ప్రాచీన తాళపత్రగ్రంథాలను దీక్షగా పరిశీలిస్తున్నారు. మరొక వృద్ధుడు నేల మీద గీసిన పెద్దపెద్ద గీతలను పరిశీ లిస్తున్నాడు. తలుపు తెరిచిన చప్పుడు వినగానే, "ఎవరు నువ్వు? ఎందుకిలా వచ్చావు?" అని అడిగాడు ఒక పండితుడు.

"గదిని శుభ్రంచేయడానికి వచ్చాను స్వామీ! తమకు ఇబ్బంది కలిగించి



మాని ఆయన గదిలోకి వెళ్ళాడు. అందు వల్ల ఆయనను చూడటానికి సాధ్య పడలేదు. సాయంకాలం ఉద్యానవనానికి వస్తాడు. అప్పుడే మాట్లాడాలి,'' అనిచెప్పి ద్వారపాలకుడు అలాగే పడుకుని కొంత సేపటికల్లా నిద్రపోయాడు.

మహేంద్రనాధుడు ఆ తరవాత కిటికీ దగ్గరికి వెళ్ళి, వెలుపలికి చూస్తూ కూర్చున్నాడు. సూర్యాస్తమయానికి కొంత సేపు ఉందనగా, ఎవరో ఒకవ్యక్తి ఉద్యాన వనంకేసి రావడం కనిపించింది. అతడు పొడవాటి అంగరఖా ధరించి ఉన్నాడు. పొడవాటి జుట్టు ఉన్నదిగాని గడ్డంమాత్రం పొట్టిగా ఉన్నది. రూపం స్పష్టంగా కని పించడం లేదు కాని, అతని నడకలో రాచ ఠీవి ఉట్టిపడుతున్నది. అతడే ఆ భవనం యజమాని అయివుంటాడని మహేంద్రనాధుడు ఊహించాడు. అతడు ఒకటి రెండుసార్లు ద్వారపాలకుడి గదికేసి చూడడం మహేంద్రనాధుడు గమనించాడు. వెంటనే అతడు నిద్ర పోతున్న ద్వారపాలకుణ్ణి తట్టిలేపి, ''మిత్రమా! మీ యజమాని ఉద్యానవనం లోకి వచ్చాడు. ఆయన నీకోసం చూస్తున్న ట్లున్నది,'' అన్నాడు.

ద్వారపాలకుడు ఉలిక్కిపడి లేచి కిటికీగుండా బయటికి చూసి, ''అవు నవును, ఆయనే మా యజమాని. ఆయన నిన్ను చూడలేదుగదా?'' అన్నాడు.

''లేదు! నేను లోపలే ఉన్నాను. గదినుంచి వెలుపలికి పోలేదు!'' అన్నాడు మహేంద్రనాధుడు.

ద్వారపాలకుడు హడావుడిగా తలపాగా ధరించి, ఉద్యానవనంలోకి వెళ్ళి, యజ మానికి నమస్కరించాడు. యజమానీ, ద్వారపాలకుడూ ఏవో మాట్లాడుకోవడం మహేంద్రనాధుడికి కనిపించింది. యజ మాని చేయెత్తి భవనం అవతలివైపుకు చూపుతూ ఏదో చెప్పాడు. ద్వారపాలకుడు వంగి నమస్కరించి వెనుదిరిగాడు. యజ మాని భవనంలోకి వెళ్ళిపోయాడు.

చీకటి పడుతూండగా, ద్వారపాలకుడు వచ్చి మహేంద్రనాథుణ్ణి చూసి నవ్వుతూ, "నీకొక శుభవార్త! మా యజమాని భవనానికి అవతలివైపున ఉన్న ద్వారపాలకుణ్ణి మార్చమన్నాడు. అవతలివైపున అందరూ స్త్రీలే ఉంటారు. అక్కడ కాపలా ఉండడానికి నీకు సమ్మతమైతే..." అనే మాటను పూర్తిచేసేలోగా, "తప్పక ఉంటాను. ఈరోజే ఆ ఉద్యోగంలో చేరతాను," అన్నాడు మహేంద్రనాథుడు.

"మంచిది. నాతోరా మిత్రమా! నేను నిన్ను అక్కడికి తీసుకువెళతాను. అటువైపు సాధారణంగా మనుషులెవరూ రారు. తలుపులు ఎప్పుడూ మూసే ఉంటాయి!" అంటూ ద్వారపాలకుడు దివిటీ వెలిగించి, తీసుకుని ముందు నడవసాగాడు. మహేంద్రనాథుడు అతణ్ణి అనుసరించాడు. ఇద్దరూ కొంతదూరం నడిచాక కిందికి మెట్లు కనిపించాయి. వాటిగుండా మరికొంత దూరం నడిచాక గొలుసులు బిగించిన ఇనుపద్వారం కనిపించింది. అక్కడి నుంచి భవనం అంత స్పష్టంగా కనిపించడంలేదు. ద్వారపాలకుడు, "ఇక్కడ పెద్దగా పనిఏదీ ఉండదు. నేను నీకు కావలసిన ఆహారం తెచ్చిపెడతాను. పొద్దున నేను రాగానే నువ్వు వెళ్ళి నాగదిలో విశ్రాంతి తీసుకోవచ్చు. ఈ దివిటీ ఇక్కడే ఉండనీ. జాగ్రత్త సుమా!" అని హెచ్చరించి వెళ్ళాడు.

దాదాపు రెండు గంటలు గడిచాక ద్వారపాలకుడు ఆహారం తెచ్చాడు. మహేంద్రనాథుడు భోజనం చేసిన తరవాత, ద్వారపాలకుడు తాళంచెవి ఒకటి అందిస్తూ, "దీనిని జాగ్రత్తగా ఉంచు. తలుపు తెరుచుకుని వెళ్ళేవు సుమా! అంతా కీకారణ్యం. దారీతెన్నూ కనిపించదు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళాక మహేంద్రనాథుడు ఆ భవనంలో ఉన్న స్త్రీ యువరాణా? కాదా అన్న విషయం తెలుసుకోవడం ఎలాగా అని ఆలోచిస్తూ, జాగ్రత్తగా అక్కడే కూర్చున్నాడు. —(ఇంకావుంది)



# వస్తాదు కాపలా!

మల్లన్న అనేవాడు గ్రామంలో పేరుమోసిన వస్తాదు. వాడు చాలా కుస్తీపోటీలలో పాల్గొని, ఎందరో వస్తాదులను చిత్తుచేసి, అనేక బహుమతులు సంపాయించాడు. ఇదంతా ఎరిగి వున్న గ్రామాధికారి, వాడు అడిగిందే తడవుగా, గ్రామకచ్చేరీకి కాపలాదారుగా నియమించాడు.

ముమ్మరంగా శిస్తు వసూలయి, సొమ్ము కచేరీలో భద్రపరచిన తరవాత, దొంగలు ఒక రాత్రి, కచేరీ తాళాలు పగుల గొట్టి, సొమ్మంతా దోచుకుపోయారు.

గ్రామాధికారి, మల్లన్నను పిలిచి, కోపంగా, "అంతమంది దొంగలను పట్టలేకపోతే పోయావు, కనీసం వాళ్ళను ఎదిరించినట్టయినా లేదు. ఏమిటి కారణం?" అని ప్రశ్నించాడు.

అందుకు మల్లన్న, "అయ్యా! నేను కుస్తీపోటీలలో పాల్గొనే ప్రతిసారీ ముందుగా చుట్టూ చేరిన జనం, నన్ను ఈలలతో, చప్పట్లతో ఉత్సాహపరుస్తారు. అప్పుడే నాకు ఎదుటివాణ్ణి చిత్తు చేయాలన్న ఆవేశం వస్తుంది. రాత్రి దొంగలు సొమ్ము దోచుకునేటప్పుడు, వాళ్ళను ఎదిరించడానికి అలా ఉత్సాహపరిచినవాళ్ళెవరూ లేరు, ఏం చేసేది?" అన్నాడు మీసాలు మెలివేసుకుంటూ.

ఆ జవాబుతో గ్రామాధికారికి, వ్యక్తుల స్వభావాన్ని గమనించకుండా, ఆకారాన్నిబట్టి బాధ్యతలను అప్పగించడం ఎంత పొరబాటో అర్థమైంది.

—వారణాసి రామక్రిష్ణ





# అంగరక్షకుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఏ దివ్యశక్తుల్ని ఆశించి, ఇటువంటి కఠోర పరిశ్రమకు పూనుకున్నావో, నాకు తెలియదు. కానీ శ్రమకూ, సాహసానికీ తగ్గ ప్రతిఫలం ప్రతిసారీ లభిస్తుందనుకోవడం పొరపాటు. కొంతమంది దురదృష్టవంతులు పట్టుదలతో ఎంత కృషి చేసినా, ఆశించిన స్థాయికి ఎదగలేరు. మరికొంత మంది అదృష్టవంతులు అయాచితంగా అత్యున్నతస్థాయికి ఎదుగుతారు. ఇందుకు నిదర్శనంగా, ఎంతో ధైర్యవంతుడై వుండీ ఒక్కొక్కసారి అనూహ్యంగా పిరికితనంతో ప్రవర్తించే, జయసింహుడనే అంగరక్షకుడి కథ చెబుతాను, శ్రమ

## బేతాళ కథలు



తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

వైశాలీరాజ్యాన్ని విలాసవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయనకు మగ సంతానం లేదు. ఒకే ఒక్క కుమార్తె. ఆమె పేరు మృణాళిని. యుక్తవయస్కురాలయిన కుమార్తెకు తగిన వరుణ్ణిచూసి వివాహం జరిపిస్తే, తన బాధ్యత తీరిపోతుందని భావించాడు మహారాజు.

మహారాజుకు జయసింహుడనే యువకుడు అంగరక్షకుడుగా పనిచేసేవాడు. కండలు తిరిగిన శరీరంతో పోతపోసిన కంచువిగ్రహంలా ఉండే జయసింహుణ్ణి కత్తియుద్ధం, మల్లయుద్ధం, ముష్టి యుద్ధాల్లో ఓడించగల వీరులు ఆ రాజ్యంలోనే లేరని ప్రతీతి. మహారాజుకు, జయసింహుడంటే ప్రత్యేకమైన అభిమానం. రాకుమార్తె మృణాళినీ, జయసింహుడూ మూగగా పరస్పరం ప్రేమించుకోసాగారు. కానీ ఈ విషయం మహారాజుకు తెలియదు.

ఇలా వుండగా, ఒకనాడు పాటలీపుత్ర యువరాజు దీప్తివర్మ దేశాటన చేస్తూ, వైశాలీ నగరానికి వచ్చాడు. మహారాజు విలాసవర్మ, అతణ్ణి సగౌరవంగా రాజభవనానికి ఆహ్వానించాడు. విలాసవర్మకు యువరాజు దీప్తివర్మను అల్లుణ్ణి చేసుకోవాలనే కోరిక చాలారోజులుగా ఉన్నది. వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లుగా సంబరపడిన విలాసవర్మ, దీప్తివర్మకు అంతఃపురంలో ఒక ప్రత్యేక మందిరాన్ని కేటాయించి, సకలసదుపాయాలూ కలుగజేశాడు.

ఒకరోజు సాయంత్రం మహారాజు విలాసవర్మ, దీప్తివర్మను వెంటబెట్టుకుని తన అశ్వ, గజశాలల వద్దకు వెళ్ళాడు. అశ్వశాలలో ఒకమూల ప్రత్యేకంగా కట్టివేయబడిన ఒక తెల్లగుర్రాన్ని చూసి ముచ్చటపడిన దీప్తివర్మ, ''ఆహాఁ, గుర్రమంటే ఇలా ఉండాలి ! నేను ఇప్పుడే దీన్ని ఎక్కి స్వారీ చెయ్యదలిచాను,'' అన్నాడు.



ఈ మాటలకు మహారాజు కంగారుపడి, "తొందరపడకు నాయనా! ఇది అశ్వశాలకు వచ్చి వారం రోజులయింది. అశ్వశిక్షకులు ఎంత ప్రయత్నించీ, ఇంతవరకూ దీన్ని మచ్చిక చెయ్యలేకపోయారు. అయితే, నా అంగరక్షకుడు జయసింహుడొక్కడే వచ్చిన రోజునే దీన్ని ఎక్కి, అదుపులో పెట్టి స్వారీచేసిన మొనగాడు," అని హితవు చెప్పాడు.

ఆ సమయంలో పక్కనే ఉన్న అంగరక్షకుడు జయసింహుడు కల్పించుకుని, "మీరీ గుర్రాన్ని అంతగా స్వారీ చేయదలిస్తే, మీవెంట రావటానికి నన్ను అనుమతించండి," అన్నాడు వినయంగా.

దీప్తివర్మ, జయసింహుడికేసి తిరస్కారంగా చూసి, "ఓహో, నువ్వంతటి మొనగాడివా!" అంటూ గుర్రం కట్టు విప్పి, ఎగిరి దానిమీద కూర్చున్నాడు.

వెంటనే గుర్రం వాయువేగంతో దౌడు ప్రారంభించింది. అది కాసేపు అడ్డదిడ్డంగా పరిగెత్తి, చివరకు దీప్తివర్మను ఒక రాళ్ళగుట్టమీద కూలదోసింది. అతడి తలకూ, శరీరానికీ బలమైన గాయాలు తగిలినై.

భటులు దీప్తివర్మను రాజభవనానికి చేర్చారు. జరిగిన దానికి మహారాజు చాలా విచారపడ్డాడు. రాజవైద్యుడు, దీప్తివర్మకు చికిత్స ప్రారంభించి, వారం రోజుల్లో అతడి గాయాలు మానేలా చేయగలిగాడు. అయినా దీప్తివర్మ బాగా నీరసించిపోయి, నడవలేని స్థితిలో ఉన్నాడు.

ఈ పరిస్థితుల్లో ఒకనాడు, అతణ్ణి పరామర్శించేందుకు మహారాజు వచ్చాడు. ఆయన వెంట రాకుమారి మృణాళిని, అంగరక్షకుడు జయసింహుడు వున్నారు. దీప్తివర్మ, జయసింహుడికేసి కోపంగా చూస్తూ, "జయసింహా! నిన్ను గురించి వాళ్ళూ, వీళ్ళూ చెప్పుకోవటం నా చెవిన పడింది. రాజ్యంలోనే నువ్వు ఎదురులేని మహావీరుడివట! నిజంగా అంతటివాడివే అయితే, నాతో ద్వంద్వ యుద్ధానికి గానీ,



కత్తి యుద్ధానికి గానీ రా. నన్ను గెలిచావంటే, నువ్వీ రాజ్యంలోనే కాదు, లోకంలోనే వీరాధి వీరుడవనిపించుకోగలవు.'' అన్నాడు.

బాగా కాలు కదల్పలేని స్థితిలో, జయసింహుడితో కత్తియుద్ధమా? అనుకుని, ఆశ్చర్యపోయాడు, మహారాజు. రాకుమారి మృణాళిని, జయసింహు డేమని జవాబిస్తాడో వినాలని కుతూహలంగా అతనికేసి చూడసాగింది.

జయసింహుడు కాసేపు మౌనంగా వూరుకుని, ''యువరాజా! నిస్సందేహంగా మీరు మహావీరులే! అందువల్లనే, అస్వస్థత నుంచి కోలుకోకుండానే, నాతో పోటీకి సిద్ధపడుతున్నారు. కానీ, ప్రస్తుతం మీతో పోటీకి దిగలేని నా అశక్తతకు, నన్ను మన్నించండి,'' అన్నాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, మహారాజు విలాసవర్మ ఒకనాడు పదిమంది భటుల్ని వెంటబెట్టుకుని, రథంలో వేటకు బయలుదేరాడు. ఎప్పటిలా అంగరక్షకుడు జయసింహుడు, ఆయన్ను వెన్నంటే ఉన్నాడు.

ఒకచోట—ఎత్తుగా పెరిగిన గుబురు పొద చాటున పొంచివున్న పులి ఒకటి గాండ్రిస్తూ, మహారాజు మీదికి లంఘించింది. మహారాజు నిశ్చేష్టుడయ్యాడు. భటులు ఎక్కిన గుర్రాలు పులిగాండ్రింపు విని, చెల్లాచెదురుగా పారిపోయాయి. జయసింహుడు ఒరలోనుంచి కత్తి దూసే వ్యవధి లేనందున, ఒట్టి చేతులతోనే పులిని ఎదుర్కొన్నాడు. అతను ఎంత లాఘవంగా పోరాడినా పులి పంజాదెబ్బలు తప్పించుకోలేకపోయాడు. అయితే, అతడి పిడుగుల్లాంటి ముష్టిఘాతాలకు పులి వెన్నూ, కంఠనాళాలు బద్దలైపోవడంతో, అది నేలకొరిగి బాధతో గిలగిలా తన్నుకోసాగింది.

మహారాజు రథం దిగి, జయసింహుణ్ణి ఆనందంతో కౌగలించుకుని, ''జయసింహా! నీవంటి మహావీరుడు నా అంగరక్షకుడై

నందుకు గర్విస్తున్నాను. నువ్వు ఏదైనాసరే కోరుకో, సంతోషంగా ఇస్తాను,'' అన్నాడు.

''ప్రభూ! నేను నా ఉద్యోగధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించడం, ఘనకార్యంగా భావించడంలేదు!'' అన్నాడు జయసింహుడు వినయంగా.

అందరూ రాజధాని చేరాక, మహారాజు స్వయంగా రాజవైద్యుడికి చెప్పి, జయసింహుడి గాయాలకు చికిత్సచేయించాడు. ఒక పక్షంరోజుల్లో జయసింహుడు పూర్తిగా కోలుకున్నాడు.



ఆ తరవాత రెండు నెలలకు, ఎప్పటిలాగా ఆ ఏడుకూడా రాజధానిలో వసంతోత్సవాల సందర్భంగా వివిధ పోటీలు ఏర్పాటయ్యాయి.

ఒక మైదాన ప్రదేశంలో, రక్షణకోసం వలయాకారంగా నిర్మించిన వెదురుకర్రల మధ్య, మదించిన ఒక ఎద్దు నిలబడి ఉన్నది. మహారాజూ, రాకుమారి మృణాళినీ కొంచెం ఎత్తయిన ఆసనాల మీద కూర్చున్నారు. చుట్టూ నగర పౌరులు అమితోత్సాహంతో గుంపులు, గుంపులుగా నిలబడ్డారు.

ముందుగా ఆస్థాన మల్లుడు జయభేరుడు, ఎద్దుతో పోరాడేందుకు బరిలో దిగాడు. జనమంతా ఉత్సాహంగా ఈలలు వేస్తూ, మల్లుడిని ప్రోత్సహించారు. అంతలో మెరుపు వేగంతో తన మీదికి వచ్చిన ఎద్దు కొమ్ములను వడిసి పట్టుకున్నాడు, మల్లుడు. ఎద్దు బుసలు కొడుతూ ఒక్క ఊపున అతణ్ణి పైకిలేపి, క్షణాలలో ప్రేక్షకుల మధ్యకు విసిరి వేసింది.

ఆ తరవాత బరిలోకి దిగిన నగర రక్షకుడు మార్తాండకేతుడు కూడా అలాంటి దుస్థితికే పాలయ్యాడు.

అప్పుడు మహారాజు, జయసింహుడితో, ''నువ్వుమహావీరుడివి, ఆలస్యమెందుకు? ఒట్టి చేతులతో పులిని చంపిన నీకు, ఈ మదించిన ఎద్దు ఏపాటి! ఊఁ, బరిలోకి దిగు,'' అన్నాడు.



మహారాజు పక్కన నిలబడి వున్న జయసింహుడు కుప్పించి ముందుకు దూకి, ఎద్దు కొమ్ములు రెండూ బిగించి పట్టుకుని, దాని గుండెలమీద బలంగా తన్నాడు. ఆ దెబ్బకు ఎద్దు పక్కకు వరిగింది. అదే అదనుగా జయసింహుడు దాని ముందుకాళ్ళు రెండూ మెలిపెట్టి, తలతో దాని ముట్టెను గట్టిగా ఢీ కొట్టాడు. ఎద్దు చిన్నగా రంకెవేసి లేవబోయి, కాళ్ళల్లో ఒకటి విరిగిపోవడంతో పక్కకు పడిపోయింది. దాని ముక్కుకోళ్ళనుంచి నెత్తురు స్రవించసాగింది.

ఇదిచూసి చుట్టూవున్న జనులు, జయసింహుడికి జేజేలు పలికారు. మహారాజు జయసింహుణ్ణి గుండెలకు హత్తుకుని, "జయసింహా! మరొకసారి నా ప్రాణానికి నీ ప్రాణం అడ్డువేశావు. ఎంతో కృతజ్ఞుణ్ణి. ఈ పోటీలో నిన్ను విజేతగా ప్రకటిస్తున్నాను," అన్నాడు.

దానికి జయసింహుడు గంభీరంగా, "అసలు బరిలోకి దిగి ఎద్దుతో పోరాడని నేను విజేతనెలా అవుతాను, ప్రభూ! ముందు, గాయపడిన ఎద్దుకు చికిత్స చేయించండి!" అన్నాడు.

మహారాజు చిరునవ్వు నవ్వి, "ప్రాణం రక్షించిన మహా వీరుడివైన నీకు నా కుమార్తెనిచ్చి వివాహం చేసి నీ రుణం

"క్షమించండి ప్రభూ! నేను ఈ ఎద్దుతో పోరాడేందుకు సిద్ధంగా లేను," అన్నాడు జయసింహుడు.

ఇంతలో ఒక విచిత్రం జరిగింది. మహారాజు తన భుజాలచుట్టూ కప్పుకున్న ఎర్ర శాలువా, ఎద్దును ఆకర్షించి, దాన్ని రెచ్చగొట్టింది. ఎద్దు చుట్టూవున్న వెదురు కర్రల కంచెను చెంగున దూకి, అడ్డుగా వున్న జనాన్ని కుమ్ముతూ, మహారాజు కేసి వెళ్ళింది.

ఇది చూస్తూనే మహారాజు శిలాప్రతిమలా ఆసనానికి అంటిపెట్టుకుపోయాడు. రాకుమారి భయంతో కెవ్వుమంటూ అరిచి స్పృహ కోల్పోయింది.

తీర్చుకోవాలనుకుంటున్నాను. నీకు సమ్మతమేనా, జయసింహా?" అని ప్రశ్నించాడు.

"అందుకు అర్హుణ్ణని తమరు భావిస్తే, మృణాళినీదేవికి ఎటువంటి అభ్యంతరమూ లేకపోతే, నాకు సమ్మతమే," అని అన్నాడు జయసింహుడు.

మహారాజు కుమార్తెకేసి తిరిగి చూశాడు.

అసరికి మూర్ఛ తేరుకున్న మృణాళిని తల వంచుకుని ముసిముసి నవ్వులతో తన అంగీకారాన్ని తెలిపింది.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాకుమారి మృణాళినిని వివాహమాడి, ఆమె తండ్రి తదనంతరం వైశాలీరాజ్యానికి రాజు కాగల అర్హత, పాటలీపుత్ర యువరాజయిన దీప్తివర్మకు ఉన్నట్టు తెలుస్తూనే వున్నదిగదా? అతడు సాహసి, ధైర్యవంతుడు. ఇందుకు నిదర్శనం— ఎంతో తెగువతో, అంతవరకూ మచ్చిక కాని గుర్రాన్ని ఎక్కి స్వారీచేయ ప్రయత్నించడం. అందులో విఫలం అవడం అనేది అతడి ధైర్యసాహసాలకు మచ్చ కాబోదు. కేవలం దురదృష్టం మాత్రమే. అలాగే, తగిలిన గాయాలనుంచి పూర్తిగా స్వస్థుడు కాకుండానే, మహావీరుడని అందరూ చెప్పుకునే అంగరక్షకుడు జయసింహుడిని పోటీకి, రమ్మనడం అతడి ఎనలేని సాహసానికి ప్రత్యక్ష నిదర్శనం. ఇకపోతే, జయసింహుడి ప్రవర్తన ఇందుకు పూర్తిగా భిన్నం. అతడి ప్రవర్తన వైరుధ్యాల పుట్ట. అతడు భీరువో, ధీరుడో తేల్చిచెప్పడం సాధ్యపడదు. యువరాజు దీప్తివర్మపై పోటీకి సాహసించలేకపోయాడు. పులితో పోరాడడం తన యజమాని రక్షణతోపాటు, తన ఆత్మరక్షణ కూడా ఒక భాగంగా కనిపిస్తున్నది. అలాగే ఎద్దుతో పోరాడేందుకు, ముందు బరిలోకి దిగడానికి నిరాకరించడం! ఇవన్నీ పరిశీలించినప్పుడు, జయసింహుడు ఏదో అదృష్ట కారణంగా లభించిన అవ

కాశాలతో వీరుడన్న కీర్తి సంపాయించి, అత్యున్నత స్థాయికి ఎదిగిపోయినట్టు శంకించవలసి వస్తున్నది. ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''యువరాజు దీప్తివర్మలో రాచరికపు హుందాతనంగానీ, సంస్కార లక్షణాలుగానీ లేవు. అతడు ఒట్టి అసూయాపరుడు. ఇతరుల ఘనతను ఓర్చలేనివాడు. ఆ కారణం వల్లనే మచ్చికకాని గుర్రం మీద స్వారీచేసి అపహాస్యం పాలయ్యాడు. తగిలిన గాయాల నుంచి స్వస్థత కలగకముందే జయసింహుణ్ణి కత్తియుద్ధానికి రమ్మనడం, అతడిలోని కపటబుద్ధికినిదర్శనం. జయిస్తే తనొక వీరుణ్ణి జయించిన, మహావీరుడవుతాడు; ఓడితే గాయాలవల్ల కలిగిన శరీర బలహీనత కారణం అవుతుంది. ఇదంతా ఎత్తుగడే. ఇకపోతే జయసింహుడి ప్రవర్తన గురించి: మొదటినుంచీ అతడు ప్రవర్తించిన తీరులో వైరుధ్యంగానీ, నిలకడ లేకపోవటం అంటూగానీ లేదు. పులిని ఒట్టిచేతులతో ఎదుర్కోవడం, అతడి ఆత్మరక్షణలో ఒక భాగంకాదు. అతడు పిరికివాడైవుంటే, తతిమ్మా రాజభటుల లాగే అక్కడినుంచి పారిపోయివుండేవాడు. యువరాజు దీప్తివర్మ నడవలేనిస్థితిలో వుండి, జయసింహుణ్ణి కత్తియుద్ధానికి రమ్మనడమే ఒక పెద్ద అసంబద్ధం. ఆ సంగతి జయసింహుడికి తెలుసు. మహారాజు ప్రోత్సహించినా, అతడు ఎద్దుతో తలపడేందుకు ఇష్టపడకపోవడం, దాన్ని అకారణంగా గాయపరచడం ఇష్టంలేకనే. ఇవన్నీ గ్రహించినందువల్లనే మహారాజు, తన కుమార్తెను కోరి జయసింహుడితో వివాహంజరిపాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఆర్. పట్టాభిరామరాజు రచన]



## చందమామ అనుబంధం - 49

### మనదేశపు పక్షులు-జంతువులు



## కూకుడుగువ్వలు

ఒకనాడు సాలమన్‌రాజు ఎగిరే సింహాసనంలో ప్రయాణం చేస్తూండగా ఎండ తీవ్రంగా కాసింది. దాపుల ఎగురుతూన్న రాబందులు అతనికి నీడనివ్వడానికి నిరాకరించాయి. కోపంతో సాలమన్ ఆ పక్షుల మెడచుట్టూ ఈకలు లేకుండా శపించాడు. అయితే, కూకుడు గువ్వలు కొన్ని గుంపుగా ఎగురుతూ అతనికి నీడనిచ్చాయి. సంతోషించిన సాలమన్‌రాజు వాటి తలమీద అందమైన కుచ్చు ఉండేలాగా వరమిచ్చాడని ఒక పురాణకథ చెబుతుంది.

మనదేశంలోని 'ఉపుపిడే' సంతతికి చెందిన ఒకే పక్షి 'హూపో' అనే కూకుడు గువ్వ. దీని తలమీద కుంచె వంటి కొండె ఉంటుంది. శరీరం పైభాగంలోనూ, రెక్కలమీదా తోకమీదా జీబ్రాకు లాగా నల్లటి, తెల్లటిచారలుఉంటాయి. ఇంచుమించు ఒక అడుగు పొడవు గల ఈ పక్షి మట్టిని తవ్వుతున్నప్పుడు తలమీది కుచ్చు తలవెనకకు ముడుచుకుపోతుంది. పక్షి ఆనందంగా ఉన్నప్పుడు శిఖ అందంగా విసనకర్రలాగా విప్పుకుని పక్షికి ఒకవిధమైన ఠీవిని ఇస్తుంది. ఈ పక్షి హూ-పూ, హూ-పూ అని మెల్లగా అరవడంవల్ల దీనికి ఆంగ్లంలో 'హూపో' అనే పేరు వచ్చింది.

చెట్లతొర్రలలోను, గోడల సందులలోనూ, కప్పుల కిందా చెత్తా చెదారం, పీలికలు తెచ్చి ఈ పక్షులు గూళ్ళు కడతాయి. ఇవి దుర్వాసన వీస్తుంటాయి. ఈ గువ్వలు పంట పొలాలలోని పురుగులనూ, క్రిమికీటకాలనూ పట్టి తినడంవల్ల వీటిని 'రైతుబాంధవులు'గా చెబుతారు!



## మన సమకాలీన సాహిత్యం

ఒరిస్సా రాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలో విస్తరించి వున్న అడవులూ,కొండలూ మధ్య చిన్న చిన్న గ్రామాలు చాలా ఉన్నాయి. ఆ గ్రామాలలో పరజలు, గోండ్లు మెదలైన కొండజాతి ప్రజలు నివసిస్తున్నారు. వాళ్ళు అక్షరజ్ఞానం లేని అమాయకులు. కాబట్టి నాగరిక ప్రపంచానికి చెందిన వారమని చెప్పుకునే కొందరు స్వార్థపరుల చేత అతిదారుణంగా దోచుకోబడుతున్నారు.

సుక్రూజాని ఒక పేద పరజ. అతనికి భార్య ఉన్నది. మాండియా,తిక్ర అనే ఇద్దరు కొడుకులూ జిలీ, బిలీ అనే ఇద్దరు కూతుళ్ళూ ఉన్నారు. ఒకనాడు సుక్రూ భార్యను పులి ఎత్తుకు పోయింది!

తన గ్రామానికి వచ్చిన ఒక ప్రభుత్వ అధికారి ఆగ్రహానికి గురయిన సుక్రూ, ఆ అధికారిని శాంత

# గోపీనాథ్‌మొహంతి 'పరజ'



పరచడానికి లంచం ఇవ్వవలసి వచ్చింది. అయన దగ్గర ఎర్రని ఏగానీ లేదు. అందువల్ల అతడు ఒక వడ్డీవ్యాపారి దగ్గర అప్పుచేయవలసిన నిర్బంధం ఏర్పడింది.ఆ వడ్డీవ్యాపారి కిరాతక స్వభావుడు. అప్పుకు భర్తీగా సుక్రూ, అతని చిన్న కొడుకూ వడ్డీ వ్యాపారి దగ్గర వెట్టిచాకిరీ చేయడానికి ఒప్పుకున్నారు. చక్రవడ్డీతో కలిపి అసలు చెల్లించేంత వరకు వాళ్ళిద్దరూ వ్యాపారికి వెట్టిచాకిరీ చేయాలి. ఈ విధంగా అప్పు తీర్చలేని చాలామంది పేదప్రజలు జీవితాంతం బానిసలుగానే బతికేవారు. ఈ వెట్టిచాకిరీ పద్ధతిని 'గోటీ' అనేవారు.

సుక్రూ పెద్దకొడుకు మాండియా దొంగసారా కాస్తూ అధికారులకు పట్టుబడిపోయాడు. వాడూ అధికారులకు లంచం ఇవ్వవలసి వచ్చింది. మరొక మార్గం కనిపించక, తండ్రీ, తమ్ముడూ అప్పుచేసిన వడ్డీవ్యాపారి దగ్గరే అప్పు చేశాడు. వాడుకూడా వ్యాపారికి బానిసగా మారాడు!

సుక్రూ ఇద్దరుకూతుళ్ళు 'క్వారీ' లో రాళ్ళెత్తడానికి వెళ్ళారు.

ఇలా ఎంతకాలం పని చేసినా, రుణం తీరే అవకాశం లేదని సుక్రూ గ్రహించాడు. తనకున్న కొద్దిపాటి భూమిని ఆ వ్యాపారికి తాకట్టుపెట్టి, తండ్రీకొడుకులు ముగ్గురూ వెట్టిచాకిరీ నుంచి బయటపడ్డారు.



సుక్రూ, ఇద్దరు కూతుళ్ళను ఇంటికి తీసుకు వచ్చాడు. అయితే, అసరికే వాళ్ళు స్వేచ్ఛాజీవితాలకు అలవాటు పడిపోయారు. పెద్ద కూతురు జిలీ తమ పూరి గుడిసెకు మాత్రమే పరిమితమై ఉండలేక పోయింది. వర్డీవ్యాపారి వాళ్ళ గ్రామంలో మకాం పెట్టినప్పుడు వాడి కోరిక ప్రకారం వాణ్ణి రహస్యంగా కలుసు కోవడం ప్రారంభించింది. ఆ విషయం కొన్నాళ్ళకు బయటపడింది. సుక్రూకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. అయినా కూతురును ఏమీ చేయలేక పోయాడు. వర్డీవ్యాపారి జిలీని తన వెంటబెట్టుకుని పట్టణం చేరాడు. సుక్రూ, అతని కొడుకులూ పదిమందిలో తలెత్తుకోలేక పోయారు.

దృఢకాయులైన సుక్రూ కొడుకులు కష్టపడి పనిచేసి కొంత కాలానికి వర్డీవ్యాపారికి ఇవ్వవలసిన బాకీ పైకాన్ని కూడబెట్టారు. అయితే, వాళ్ళ భూమిలో అప్పటికే నారింజతోట వేయడం వల్ల దానిని వదులుకోవడానికి వర్డీవ్యాపారి ఒప్పుకోలేదు. సుక్రూ కోరాపుట్ కోర్టుకు వెళ్ళాడు. కేసు విచారణకు తేదీ నిర్ణయం జరిగింది. అయితే, వర్డీవ్యాపారి దగ్గర లంచం పుచ్చుకున్న కోర్టు అధికారులు, సుక్రూతో వేరొక తేదీ అని మార్చి చెప్పారు. అసలు విషయం తెలియని సుక్రూ, అతని కొడుకులు, అధికారులు రమ్మని చెప్పిన రోజున కేసులో గెలుపొందగలమన్న కొండంత ఆశతో పట్నం చేరారు. అయితే, అంతకు ముందెప్పుడో వాళ్ళు సమయానికి హాజరు కాలేదన్న కారణం చూపి, వర్డీవ్యాపారికి అనుకూలమైన తీర్పునిచ్చింది కోర్టు!

ఆ వార్త విని తండ్రీకొడుకులు హతాశులయ్యారు. చీకటిమయమైన తమ బతుకులను తలచుకొని విలపిస్తూ వర్డీవ్యాపారి దగ్గరికి పరుగెత్తారు. దయతలచి తమ భూమిని తిప్పి ఇవ్వమని ప్రాధేయపడ్డారు. అయితే వ్యాపారి మితిమించిన అహంకారంతో, అతిహీనంగా తిట్టిపోసి, "గుట్టుగా వెళ్ళిపొండి లేదా పెద్దపిల్లను తెచ్చుకున్నట్టే రెండో కూతురిని కూడా తెచ్చుకోగలను, జాగ్రత్త!" అని బెదిరించాడు.

ఆ మాటతో సుక్రూ, మెరుపులాంటి వేగంతో తన గండ్రగొడ్డలిని పైకెత్తి వ్యాపారి తలను తెగ నరికాడు. "మా భూమిని ఆక్రమించావు గానీ, దానిని నువ్వు అనుభవించలేవు!" అని ముగ్గురూ ఏక కంఠంతో గర్జించారు!

ఆ కేకలు విని ఇంటి నుంచి బయటకు వచ్చిన జిలీ,అక్కడి దృశ్యం చూసి హడలిపోయి ఎటో పారిపోయింది. వర్డీవ్యాపారి తలను తీసుకుని ముగ్గురూ పోలీసు స్టేషనుకు వెళ్ళి,"వీణ్ణి మేమే చంపాము. మామీద తగిన చర్య తీసుకోండి," అన్నారు!

ఆ దృశ్యాన్ని చూసిన పోలీసు అధికారి ఒక్క క్షణం భయంతో కంపించి పోయాడు!

ఒరియా భాషలో ఈనాడు గొప్ప నవలారచయితగా పేరుగాంచిన గోపీనాథ్ మొహంతి ( 1914 - 1991) ఈ నవలను రచించారు. సాహిత్య అకాడెమీ అవార్డునూ, భారతీయ జ్ఞానపీఠ పురస్కారాన్నీ అందుకున్న మొట్టమొదటి ఒరియా రచయిత మొహంతి!

# మీకు తెలుసా?

1. ఇంద్రగిరి, చంద్రగిరి అనే రెండు కొండలమధ్య వున్న ఆలయ పట్టణం ఏది?
2. పర్షియాను స్థాపించిన వారెవరు?
3. 1990 వ సం॥ నవంబర్ 9వ తేదీ జరిగిన గొప్ప సంఘటన ఏది?
4. చైనాను జయించిన మంగోలియా చక్రవర్తి ఎవరు?
5. బంగ్లాదేశ్ ఎప్పుడు ఏర్పడింది?
6. 'సతీసహగమనాన్ని' వ్యతిరేకించి పోరాడిన సుప్రసిద్ధ సంఘసంస్కర్త ఎవరు?
7. ఈ సంవత్సరం అక్టోబరు 12వ తేదీ జరుపుకున్న చారిత్రాత్మకమైన సంఘటన ఏది?
8. 'మోప్లాలు' అని ఎవరిని పిలుస్తారు?
9. అమెరికా జాతీయపక్షి ఏది?
10. కాలి బొటనవేలికి తగిలిన బాణం కారణంగా ప్రాణాలు వదిలిన పురాణపురుషుడు ఎవరు?
11. రంగులను బట్టి నాలుగు సముద్రాలకు పేర్లు వచ్చాయి. అవి ఏవి?
12. ప్రపంచంలో కెల్లా అతి పొడవైన రైలుమార్గం ఏది?
13. రెండుసార్లు 'నోబెల్ బహుమతి' పొందిన ఏకైక స్త్రీ ఎవరు?
14. కళ్ళద్దాలలో ఉపయోగించే 'బైఫోకల్ లెన్స్' ను కనుగొన్న వారెవరు?
15. 'యునెస్కో' అధ్వర్యంలో నిర్మించబడిన మొట్టమొదటి అంతర్జాతీయ పట్టణం ఏది?

## సమాధానాలు

1. కర్నాటక రాష్ట్రంలోని శ్రావణబెళగొళ.
2. సైరస్ చక్రవర్తి; క్రీ.పూ. 500 - 400 మధ్య.
3. బెర్లిన్ కుడ్య పతనం.
4. కుబ్లైఖాన్.
5. డిసెంబర్ 1971.
6. రాజా రాంమోహన్‌రాయ్.
7. క్రిస్టఫర్ కొలంబస్ అమెరికాను కనుగొని 500 సం॥ పూర్తయింది.
8. కేరళ రాష్ట్రంలోని మలబార్ ప్రాంత ముస్లింలను.
9. తెల్లతల డేగ.
10. శ్రీకృష్ణుడు.
11. తెల్లసముద్రం, నల్లసముద్రం, ఎర్రసముద్రం, పసుపుసముద్రం.
12. మాస్కోనుంచి వ్లాడివాస్టాక్ వరకు ఉన్న 5,864 మైళ్ళ రైలు మార్గం.
13. మేరీక్యూరీ.
14. బెంజమిన్ ఫ్రాంక్లిన్.
15. పాండిచ్చేరి సమీపంలోని 'అరొవిల్'.



# రమణమ్మ గెలుపు

సోమయ్య అనే అతనికి, రమణమ్మ అనే యువతితో కొత్తగా పెళ్ళయింది. ఉద్యోగ రీత్యా సోమయ్య, రమణమ్మతో పేరవరం అనే ఊరిలో కాపరం పెట్టవలసి వచ్చింది. పేరవరం ఊరంతా ఎంత తిరిగినా, ఇద్దరికీ అద్దెకుగాను ఒక్క ఇల్లయినా దొరకలేదు.

వాళ్ళకు ఊరిచివర తాళం వేసివున్న, ఒక అందమైన భవంతి కనిపించింది. దాన్ని గురించి ఊరివాళ్ళను ఆరా అడిగితే, అది ధనయ్య అనే ఒకవ్యాపారి దని చెప్పారు. అయితే, ఆ ధనయ్య ఇప్పటికి ఎన్నో ఏళ్ళ కిందట, ఒక పడవ ప్రమాదంలో కుటుంబంతో సహా మరణించాడు. అప్పటి నుంచీ ఆయన పిశాచ రూపంలో, అక్కడే తిరుగుతున్నాడు. ఎవరైనా మొండిగా, ఆ ఇంట చేరితే భయపెట్టి పారిపోయేలా చేస్తున్నాడు.

ఊరివాళ్ళు చెప్పింది విని, సోమయ్య దిగాలు పడిపోయి, "నాకసలే భూతాలన్నా, పిశాచాలన్నా చచ్చేంత భయం. ఈ ఇల్లు మనకొద్దులే," అన్నాడు భార్యతో విచారంగా.

"నాకు అలాంటి వాటిల్లో నమ్మకం లేదు. నిజంగా వున్నా, భయపడను. ఈ ఇంట్లో అయితే, మనం అద్దెకూడా ఇవ్వనవసరంలేదు. ఆ పిశాచం సంగతి నేను చూసుకుంటాను," అన్నది రమణమ్మ.

సోమయ్య చేసేదిలేక, రమణమ్మ మాటకు సరేనన్నాడు. ఆ ఇంటి తాళంచెవి గురించి అడిగితే, దానిసంగతి మాకెవరికీ తెలియదని చెప్పి, కావాలనుకుంటేతాళం బద్దలు కొట్టినా, మాకెలాంటి అభ్యంతరం లేదన్నారు ఊరివాళ్ళు.

ఇదీబాగానే ఉన్నదనుకుని సోమయ్య, రమణమ్మ తాళం బద్దలుకొట్టి, ఇంటి

రాంబాబు



తలుపు తెరిచి లోపలికి వెళ్ళారు. అక్కడి పరిస్థితి చూసి వాళ్ళకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఇంట్లో ఎక్కడా మచ్చుకు బూజు కనబడలేదు. పైగా ప్రతి గదీ అందంగా, శుభ్రంగా వుండి, ఎక్కడి సామాన్లు అక్కడ చక్కగా సర్దిపెట్టి వున్నాయి. అంతేకాక, ఒక గదిలో మంచం, దానిమీద కొత్తగా పరిచినట్టున్న దుప్పటి వాళ్ళ కంటబడింది.

ఇదిచూసి సోమయ్య వణుకుతూ, "ఇల్లువున్న తీరు చూస్తే, నిజంగానే ధనయ్య పిశాచి రూపంలో ఇంటిలోపల తిరుగుతున్నాడని తేలిపోతున్నది!" అన్నాడు.

సోమయ్య అలా అనగానే, "అవును, ఆ ధనయ్యను నేనే! ఎంతో డబ్బుపోసి, చాలా అందంగా కట్టుకున్న ఈ భవంతి మీద మమకారం తీరక, నేను పిశాచ రూపంలో దీన్ని కనిపెట్టుకుని తిరుగుతున్నాను!" అంటూ పిశాచరూపంలో వున్న ధనయ్య, వాళ్ళముందు ప్రత్యక్షమై, "మీరీ ఇంట్లో వుండటానికి, నాకేం అభ్యంతరం లేదు. కానీ ఇంటిని మాత్రం, ఇప్పుడెలా వున్నదో అలా శుభ్రంగా, అందంగా వుంచాలి. అలా వుంచకపోతే, మిమ్మల్ని పట్టి పీడిస్తాను, జాగ్రత్త!" అన్నాడు.

పిశాచాన్ని చూసి భయపడిపోయిన సోమయ్య భుజం తట్టి రమణమ్మ, పిశాచంతో, "అదంతా సరే. ఇంతకూ నువ్వెక్కడ ఏ గదిలో వుంటున్నావు?" అని అడిగింది.

పిశాచం, రమణమ్మకు తానుండే గది చూపించి, ఆ గదిలో మాత్రం అడుగు పెట్టవద్దని హెచ్చరించింది.

ఆవిధంగా పిశాచం ఇంట కొత్తకాపురం ప్రారంభించిన రమణమ్మ, మొదటి రోజునే పెరటి దొడ్లో ఒక మూలగా చెత్తా చెదారం పారవేసి, వారం రోజులు గడిచే లోపల, ఒకపెద్ద చెత్తకుప్ప తయారు చేసింది. ఇది చూసిన ధనయ్యపిశాచం,



ఆ చెత్తనంతా ఎత్తి వీధిలో పడవేయమని బెదిరించింది. అయినా, రమణమ్మ ఆ బెదిరింపులను లెక్కచేయకపోగా, ఇంట్లో కూడా ఎక్కడి తుక్కు అక్కడే వదిలేసి, గదులన్నిటినీ అపరిశుభ్రంగా వుంచసాగింది.

ఇది గమనించిన సోమయ్య, రమణమ్మతో, "నువ్వు ఇలా చేస్తుంటే, ఆ పిశాచం ఏనాడో మనిద్దరి పీకలూ నులుము తుంది. ఇంటిని కాస్త శుభ్రంగా వుంచడం నేర్చుకో," అన్నాడు.

రమణమ్మ చిరాకుపడుతూ, "ఏం చెయ్యమంటారు ? చిన్నప్పటినుంచీ నాకు పనిబద్ధకం," అనేసింది.

క్రమంగా పెరట్లో వేసే తుక్కూ, చెడిపోయిన కాయగూరలతో చెత్తపోగూ బాగా పెరిగి, కుళ్ళి, ఆ వాసన ఇంట్లోకి రాసాగింది.

ఒకనాటి అర్ధరాత్రి పిశాచం, నిద్రపోతున్న రమణమ్మ మంచం పట్టెమీద కూర్చుని, గట్టిగా అరిచి, "ఒసే, ఇంట్లో నువ్వు అడుగు పెట్టినప్పుడే నేను చెప్పాను గదా—అశుభ్రాన్ని భరించలేనని! దొడ్లో నువ్వు పోగుపెడుతున్న చెత్తాచెదారం కుళ్ళిన వాసనతో, నా ముక్కు బద్దలవుతున్నది. ఈ క్షణమే నిన్ను చంపెయ్యబోతున్నాను," అన్నది.

ఆ మాటలకు రమణమ్మ ఏమాత్రం చలించకుండా, పిశాచాన్ని మంచం మీది నుంచి కిందికి తోసేసి, "పిశాచాలు మనుషుల్ని భయపెట్టగలవు గాని, వాటికి మనుషుల్ని చంపడానికి అవసరం అయిన బలం వుండదని, నాకు తెలుసు ! నువ్వు నన్నేమీ చేయలేవు!" అంటూ లేచి గోడవారగా వున్న చీపురుకట్టను చేతికి తీసుకున్నది.

పిశాచం కీచుమంటూ అరిచి దూరంగా పోయి, "సరే, ఇక నీ జోలికి రాను. ఇంటినీ, పెరటినీ నీకిష్టమైనంత అశుభ్రంగా ఉంచుకో. నా గది జోలికి మాత్రం రాకు," అన్నది.

"అర్ధరాత్రివేళ బంగారంలాంటి నిద్ర పాడుచేశావు. నీ గది సంగతి రేపాలో చిస్తాను," అంటూ నిద్రలోకి జారుకున్నది రమణమ్మ.

ఆ మర్నాడు ఉదయాన్నే లేచి రమణమ్మ, పెరట్లో వున్న చెత్తపోగులోంచి కొంత చెత్త తెచ్చి, దాన్ని పిశాచం వుండే గదినిండా చిమ్మింది.

వెంటనే పిశాచం వణుకుతూ గదిలో ఒకమూల నిలబడి, "అమ్మా తల్లీ రమణమ్మా! నీ అశుభ్రం మూలంగా నాకీ ఇంటిమీద మమకారం పోయింది. నువ్వే గెలిచావు. నే నిప్పుడే పోయి, ఇక్కడికి దాపుల నున్న అడవిలో ఏ చెట్టుమీదో కాలం వెళ్ళబుచ్చుతాను. అయితే తల్లీ నాదొక చిన్న మనవి. ఇంటిని కాస్త శుభ్రంగా వుంచడం నేర్చుకో. అలా కాకపోతే, నీ అశుభ్రానికి నీ భర్తకూడా ఎప్పుడో నిన్ను వదిలి పారిపోయే ప్రమాదం వున్నది," అని అడవికేసి వెళ్ళిపోయింది.

ఆ రోజు సాయంత్రం సోమయ్య పని నుంచి ఇంటికి రాగానే, రమణమ్మ ఉత్సాహంగా అతడితో జరిగినదంతా చెప్పింది.

సోమయ్య అంతావిని కోపంగా, "రేపటి నుంచయినా, ఇంటిని కాస్త శుభ్రంగా వుంచు. లేకపోతే, పిశాచం చెప్పినట్టు నిన్నొదిలి, నేను మరెక్కడికైనా పారిపోవలసి వస్తుంది," అన్నాడు.

రమణమ్మ ముఖం ముడుచుకుని, "నాకు పనిబద్ధకమని ఎప్పుడో చెప్పాను. పిశాచాన్ని వదిలించుకోవడంలో కాస్త మితిమీరాను కాని, రేపటినుంచి ఇంటిని శుభ్రంగా ఉంచుతాను," అన్నది.

"అదుగో! పిశాచం అన్నిసార్లుచెప్పినా, నేను ఇంతగా చెబుతున్నా, నీలో ఇంకా ఆ బద్ధకపు బుద్ధి అలాగే ఉండిపోయింది. రేపటి నుంచి కాదు, ఇవ్వాళ నుంచే ఇంటిని శుభ్రంగా ఉంచు," అన్నాడు సోమయ్య నవ్వుతూ.

రమణమ్మ కూడా ఆ మాటలకు సోమయ్యతోపాటు నవ్వింది.






# చెప్పుడుమాటలు

ఒకనాటి ఉదయం శంకరయ్య అనే అతను, వీధిలో హడావిడిగా నడిచిపోతున్న మారయ్యను చూసి, "మారయ్యగారూ! మీతో చిన్న పనుంది," అంటూ కేకేసి పిలిచాడు.

మారయ్య, శంకరయ్య దగ్గరకు వచ్చి, "ఏమిటో త్వరగా చెప్పు. నాకు అవతల చాలా పనుంది," అన్నాడు.

"మరేం లేదు. శివాలయం వీధిలో వుండే చంద్రయ్య ఎలాంటివాడు?" అని అడిగాడు శివయ్య.

ఆ ప్రశ్నకు మారయ్య క్షణం ఆశ్చర్య పోయి, తర్వాత తేరుకుని, "ఎందుకు?" అని ప్రశ్నించాడు.

"అతను నన్ను కొంతడబ్బు బదులుగా అడిగాడు. నేను ఊరుకు కొత్తవాణ్ణి. అతనెలాంటివాడో నాకు బొత్తిగా తెలియదు. ముందు జాగ్రత్తగా మీలాంటివారిని అడిగిన తరవాత డబ్బిస్తే మంచిదని, చంద్రయ్యను రెండు రోజుల తరవాత కలవమని చెప్పాను," అని అన్నాడు శంకరయ్య.

ఇది విని మారయ్య లోలోపల నవ్వుకున్నాడు. శంకరయ్యది అమాయకత్వమో, లేక అతిజాగ్రత్తో అర్థం కాలేదు అతడికి.

మారయ్య ఒక్క క్షణం ఆగి, "ఆ చంద్రయ్య అంతగా మాట నిలుపుకునే మనిషి కాదు. నిజం చెప్పాలంటే బొత్తిగా బాధ్యత తెలియని మనిషి. అలాంటి వాడితో నువ్వు వేగలేవు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

శంకరయ్య ఉన్నఊరు నదిముంపులో కొట్టుకుపోగా, వచ్చిన నష్టపరిహారంతో, ఈ ఊరు వచ్చి భూములు కొని స్థిరపడిన వాడు. అందుకే చంద్రయ్య డబ్బు

దాసరి వెంకటరమణ

అడగ్గానే, ఎందుకయినా మంచిదని అతను ఎలాంటివాడని మారయ్యను వాకబుచేశాడు.

రెండు రోజులు తరవాత చంద్రయ్య, శంకరయ్య ఇంటికి వచ్చి డబ్బు అడిగాడు. శంకరయ్య తనవద్ద డబ్బు సర్దుబాటు కాలేదని అబద్ధం ఆడేశాడు.

చంద్రయ్య, శంకరయ్యను బతిమాలుతూ, "నేనెంత డబ్బు అవసరంలో ఉన్నానో, ఆ దేవుడికే తెలియాలి! నాభార్య ఆరోగ్యం బాగాలేదు. పట్నం తీసుకుపోయి, మంచి వైద్యుడికి చూపించమని ఇరుగు పొరుగు సలహా ఇస్తున్నారు. నేనెంత నమ్మకస్థుణ్ణో, విశ్వాసపాత్రుణ్ణో ఊరంతా ఎరిగిందే. ఒక్క నెల రోజుల్లో మీ డబ్బు పువ్వుల్లో పెట్టి మరీ తెచ్చిస్తాను. మీ మేలు ఈ జన్మకు మరవను. దయచేసి లేదనకండి!" అంటూ నమ్మబలికాడు.

శంకరయ్య కొంతసేపటికి కాస్త మెత్తబడి, "సరే, చూస్తాను! రేపు కనబడు," అన్నాడు.

చంద్రయ్య వెళ్ళిపోగానే, శంకరయ్య పనిగట్టుకుని ఇంట్లోంచి బయటకు వచ్చి, వీధి అవతల ఉన్న శివాలయంకేసి నడిచాడు.

ఆ సమయంలో, ఆలయపూజారి వీరబసవలింగాచారి నదిలో స్నానం చేసి, మంత్రపుష్పం చదువుతూ ఆలయంకేసి వస్తున్నాడు. శంకరయ్య, ఆయనకు



నమస్కరించి, ఆయనతోపాటు నడుస్తూ, తనకెదురైన సమస్యను క్లుప్తంగా వివరించి, "అయ్యా, చంద్రయ్య చాలా డబ్బు అవసరంలో వున్నట్టే కనబడుతున్నది. నేనతడికి సాయపడదామనుకుంటున్నాను. చంద్రయ్యను గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఈ విషయం ఊళ్ళో పెద్దమనిషయిన మారయ్యగారిని అడిగితే, చంద్రయ్య అంత నమ్మదగిన మనిషి కాదని చెబుతున్నాడు," అన్నాడు.

ఇది వింటూనే పూజారి ఆగిపోయి, శంకరయ్యకేసి సూటిగా చూస్తూ, "చెప్పేడు మాటలు వినకు చెడిపోతావు!" అని ముందుకు సాగిపోయాడు. శంకరయ్య ఆలోచిస్తూ ఇంటికి తిరిగివచ్చి, మర్నాడు చంద్రయ్య అడిగిన డబ్బు ఇచ్చి పంపేశాడు.

నాలుగయిదు నెలలు గడిచాయి. చంద్రయ్య జాడలేదు. అతనే డబ్బు తెచ్చిస్తాడని ఎదురు చూసిన శంకరయ్య విసిగిపోయి, చంద్రయ్య ఇంటికి వెళ్ళి డబ్బు అడిగాడు.

చంద్రయ్య, శంకరయ్యను చూసి ఏమాత్రం తొణక్కుండా, "నీ డబ్బు ఎక్కడికీ పోదు, ఇస్తాలే! ఈ మధ్య బొత్తిగా చేతిలో డబ్బాడడంలేదు. డబ్బు రాగానే కబురు చేస్తాను. వచ్చి తీసుకుపొండి!" అన్నాడు.

శంకరయ్య ఓపిగ్గా మరో రెండునెలలు చూశాడు. లాభం లేకపోయింది. ఎప్పు



తైనా చంద్రయ్య వీధిలో ఎదురుపడినా, ఏమాత్రం పరిచయంలేని మనిషిలాగా దాటిపొయ్యేవాడే కాని, పలకరించేవాడు కాదు.

ఇది పనికాదని, ఒకనాడు శంకరయ్య శివాలయం పూజారి దగ్గరకు వెళ్ళి, చంద్రయ్య డబ్బు ఎగవేయచూస్తున్న సంగతి వివరంగా చెప్పి, "ఏమనుకో కండి, ఇదంతా తమ చలవే! మీ మాట నమ్మి నేను మోసపోయాను," అన్నాడు ఎంతో బాధగా.

పూజారి ఆశ్చర్యపోయి, "ఏమిటీ, నా మాటా! మధ్యలో నేనేం చేశాను?" అన్నాడు.

"ఏం చెయ్యలేదంటారా? చంద్రయ్య గురించి మారయ్య ఇలా అంటున్నాడు; మీ అభిప్రాయం ఏమిటి? అని మిమ్మల్ని అడిగితే, చెప్పుడుమాటలు వినకు చెడి పోతావు, అని సెలవిస్తిరి. మర్యాదస్థులు, లోకం తిరిగినవారు, అని మీ మాటమీద గౌరవం ఉంచి, మారయ్య అబద్ధం చెబుతున్నాడని భావించి, చంద్రయ్యకు డబ్బిచ్చి మోసపోయాను," అన్నాడు శంకరయ్య.

ఇందుకు పూజారి చిన్నగా నవ్వి, "నేను ఆరోజు సూత్రప్రాయంగా చెప్పిన విషయం, నువ్వు సరిగా అర్థంచేసుకోలేదు. నేను చెప్పినా, మారయ్య చెప్పినా— అంటే చెప్పుడుమాటలు విని అభిప్రాయం ఏర్పరచుకోవడం కానీ, మార్చుకోవడం కానీ చెయ్యకూడదని, నేను సూచన ఇచ్చాను. ఒక మనిషి ఎలాంటివాడు, అన్న విషయాన్ని, అతడితో కలిగిన పరిచయంద్వారా నీకై నువ్వు గ్రహించాలి తప్ప, అందుకోసం ఇతరుల మాటలమీద ఆధారపడడం ఎంత అవివేకం!" అన్నాడు.

పూజారి మాటల్లోని అంతరార్థం అప్పటికి అర్థమైంది శంకరయ్యకు. అతడు పూజారి దగ్గర సెలవు తీసుకుని, చంద్రయ్య నుంచి డబ్బు ఏవిధంగా వసూలు చేయాలా అని ఆలోచిస్తూ, ఇంటి దారి పట్టాడు.





రావణుడు లంకాయాగం చేస్తున్న సంగతి విభీషణుడికి తెలిసింది. అతడు రాముడి తోనూ, వానరవీరులతోనూ ఇలా అన్నాడు: "రావణుడు చేసే హోమం పూర్తి అయిన పక్షంలో, అందులోనుంచి ఉక్కు శరీరాలు గల యోధులూ, చతురంగ బలాలూ పుట్టుకొస్తాయి. అప్పుడు రావణుణ్ణి జయించటం అసాధ్యం. అందుచేత యాగాన్ని భగ్నంచెయ్యాలి."

కాని అది ఎలా జరగాలన్నది సమస్య అయింది.

"అంగదుడికి అదృశ్యకరణి అనే విద్య తెలుసు. దాని సహాయంతో అతను రావణుడి హోమం సాగకుండా చెయ్య వచ్చు." అన్నాడు జాంబవంతుడు.

అదృశ్యకరణి ప్రభావంతో అంగదుడు ఎవరికీ కనబడకుండా రావణుడి అంతః పురం ప్రవేశించి, మండోదరిని కొప్పు పట్టి ఈడ్చుకుంటూ రావణుడున్న చోటికి వచ్చాడు. అది చూసి కూడా రావణుడు యాగదీక్ష నుంచి లేవలేదు. అంగదుడు మండోదరిని ఇంకెక్కడికో ఈడ్చుకు పోసాగాడు,

"మూడు లోకాలనూ జయించినవాడి భార్యను ఇప్పుడు కాపాడేవారు లేరా?" అని మండోదరి ఆర్తనాదం చేసింది. రావణుడు ఇక భరించలేక యాగదీక్ష వదిలిపెట్టి లేచాడు. అదృశ్యుడుగా ఉన్న అంగదుడు మండోదరిని వదిలిపెట్టి, చల్లగా జారుకున్నాడు.

**30. రామలక్ష్మణుల అపహరణ**



త్యాగం చేస్తాను. నన్నుచంపి విభీషణుడికి పట్టం గట్టుతానని ప్రతిజ్ఞ చేసిన రాముడు నన్ను చంపలేడు గనక ప్రతిజ్ఞాభంగం చేసినవాడవుతాడు. విభీషణుడికి రాజ్యం రాదు. నన్ను చంపి సీతను తీసుకుపోతా నన్న ప్రతిజ్ఞ కూడా భంగమవుతుంది. రాముడు దొంగలాగా వచ్చి తన భార్యను ఎన్నడూ తీసుకుపోలేడు. నేను పోయినాక మీరంతా సహగమనం చేసేటప్పుడు సీతను కూడా చితిలోకి నెట్టండి. సీతావియోగంతో రాముడు చస్తాడు.'' అని మతిభ్రమ కలిగినవాడిలాగా పడమటి దిక్కుగా వెళ్ళాడు.

''ఇప్పటికైనా రాముడితో సంధి చేసుకో.'' అని మండోదరి రావణుడికి సలహా ఇచ్చింది.

ఒకప్పుడు తన బలమూ, తనకున్న అంగబలమూ చూసుకుని రాముడితో యుద్ధం చేయ నిశ్చయించిన రావణుడు, ''బంధుమిత్రులనూ, తమ్ముణ్ణీ, కొడుకు లనూ పోగొట్టుకుని, ఇప్పుడు క్షుద్రుడిలాగ రాముడితో సంధి చేసుకోమంటావా? రాముడు నన్ను చంపుతాడన్న నమ్మకం తోనే గదా ఈ సలహా ఇస్తున్నావు? రాముడు నన్ను చంపాడన్న కీర్తి పొంద కుండా నేనే ప్రాయోపవేశం చేసి, యోగ మార్గాన కపాలం భేదించుకుని ప్రాణ

లంకలో ఇలా ఉండగా, లంకకు సహస్రయోజనాలు దిగువన ఉన్న పాతాళ లంకలో మరొక కథ జరుగుతున్నది.

పాతాళలంకను ఏలేవాడు మైరావ ణుడు. అతను గొప్ప మంత్రశక్తులు గలిగి, మాయలు తెలిసినవాడు. అతని అన్న అహిరావణుడు.

మైరావణుడు నాగలోకంనుంచి వాసుకి కుమార్తె అయిన చంద్రసేనను తన మాయతో ఎత్తుకొచ్చి, తనను పెళ్ళాడమని నిర్బంధించసాగాడు. చంద్రసేన అసమాన సౌందర్యవతి. ఆమె రాముణ్ణి వరించి, అతనే తన భర్త అని మైరావణుడితో అన్నది. సీతా స్వయంవరానికి ఆమె

నాగులవెంట వెళ్ళి, రాముణ్ణి చూసినది మొదలు అతని విగ్రహాన్ని ఆరాధిస్తూ వస్తున్నది.



లంకలో రావణుడు పడమటి తీరానికి చేరుకుని, అక్కడ దర్భలు పరిచి, వాటి మీద పడుకుని, ప్రాయోపవేశానికి సిద్ధమయ్యాడు.

అప్పుడు నారదుడు అటుగా వచ్చి, ''ఇదేం పని, రావణా? నువ్వు తోడులేని వాడివైపోయావా? నీ మిత్రుడూ, నీకు సోదరుడిలాటివాడూ అయిన మైరావణుణ్ణి మరిచావా?'' అని హెచ్చరించి, వెళ్ళిపోయాడు.

ఈ మాట వింటూనే రావణుడు నూతనోత్సాహంతో లేచి కూర్చుని, కళ్ళు మూసుకుని మైరావణుణ్ణి తలుచుకున్నాడు.

ఆ సమయంలో మైరావణుడు చంద్రసేన వద్దకు వచ్చి, ఆమె ఆరాధిస్తున్న రాముడి విగ్రహాన్ని లాగేసి, ''ఈ రాముణ్ణి తెచ్చి కాళీమాతకు బలి ఇస్తాను,'' అన్నాడు.

''ఆ రాముడే నిన్ను చంపేస్తాడు,'' అన్నది చంద్రసేన.

''నన్ను చంపటం తేలిక అనుకున్నావా? ఈ పాతాళలంకకు వెయ్యి యోజనాల దిగువన ఒక భయంకరమైన గుహలో, ఒక రత్నపేటికలో అయిదు తుమ్మెదల రూపంలో నా ప్రాణాలున్నాయి. పేటిక తెరిచి, ఝుమ్మని పైకి వచ్చే అయిదు తుమ్మెదలనూ ఒక్కసారిగా చంపితేనే గాని నేను చావను. ఆ భయంకర గుహను అతిభయంకర పిశాచాలు రక్షిస్తున్నాయి. నా ప్రాణాలను తీయగలవాడు మూడు లోకాలలోనూ లేడు,'' అంటూ మైరావణుడు రాముడి విగ్రహాన్ని నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలు చేశాడు.

ఆ క్షణంలోనే అతనికి రావణుడు తలుచుకోవటం తెలిసింది.

రావణుడు కళ్ళు తెరిచేసరికి, భూమిని చీల్చుకుని వచ్చి, తన ఎదట నిలబడిన మైరావణుడు కనిపించాడు. ఇద్దరూ కౌగలించుకున్నారు.



రావణుడు మైరావణుడితో రామ, లక్ష్మణుల సంగతి చూడమన్నాడు.

"నాకు కావలసినదే నువ్వు అడిగావు. రేపు ఆ రామలక్ష్మణులను కాళికి బలి ఇచ్చేస్తాను." అన్నాడు మైరావణుడు. రావణుడు సంతోషించి, మైరావణుణ్ణి తన మందిరానికి తీసుకుపోయాడు.

చారులద్వారా విభీషణుడికి ఈ సంగతి తెలియవచ్చింది. అప్పటికి రాత్రి అయిపోవటంవల్ల రామ, లక్ష్మణులు నిద్రకు ఉపక్రమించబోతున్నారు. విభీషణుడు వానరుల వద్దకు వచ్చి, మైరావణుడి సంగతి చెప్పి, "మైరావణుడు రామలక్ష్మణులను అపహరించకుండా మనం కాపాడాలి." అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

హనుమంతుడు వెంటనే తన తోకను పెంచి, రామ, లక్ష్మణుల చుట్టూ ఒక కోటలాగా చుట్టాడు. తరవాత అతను ఆ తోక చుట్ట మీద ఎక్కి కూర్చుని, ఒక్క చీమఅయినా లోపలికి పోకుండా జాగ్రత్తగా చూస్తున్నాడు.

కొంతసేపటికి విభీషణుడు మళ్లీ వచ్చి, హనుమంతుడి శ్రద్ధను మెచ్చుకుని, ఒక్కసారి తాను లోపలికి వెళ్లి, రామలక్ష్మణుల చేతులకు రక్షాబంధాలను కట్టవలసి ఉన్నదని చెప్పాడు. హనుమంతుడు తన తోకను సడలించి, విభీషణుడు లోపలికి పోవటానికి దారి ఇచ్చాడు.

విభీషణుడు తన పని పూర్తిచేసుకుని బయటికి వచ్చి, "హనుమంతుడా, ఆ మాయలమారి మైరావణుడు నా రూపంలో గాని, మనలో మరొకరి రూపంలో గాని వచ్చి మోసం చేయగలడు, జాగ్రత్తసుమా!" అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

అతను అన్నట్టే కొంతసేపటికి విభీషణుడు మళ్ళీ వచ్చాడు. హనుమంతుడు అతని గొంతు పట్టుకుని, గదతో చావగొట్టబోయాడు, "మైరావణుడా, నీ జిత్తులు నా దగ్గిరనా?" అంటూ.

"అయ్యో, వెర్రివాడా! మోసం జరిగిందా! మైరావణుడు నా రూపంలో వచ్చాడా? రామ, లక్ష్మణులను వాడు ఎత్తుకుపోలేదు గదా?" అన్నాడు విభీషణుడు. హనుమంతుడు తన తోక చుట్టలోకి చూస్తే రామ, లక్ష్మణులు లేరు!

హనుమంతుడు నీరుగారిపోయి, చతికిలబడ్డాడు. అప్పుడు జాంబవంతుడు, "లే, లే! రామ, లక్ష్మణులను రక్షించగలవాడివి నువ్వు ఒక్కడివే!" అన్నాడు.

హనుమంతుడు విభీషణుడి ద్వారా పాతాళలంకకు ఎలా వెళ్లాలో తెలుసుకుని, శరీరాన్ని పెంచి, ఆకాశంలోకి ఎగిరాడు..



ఈలోపల, విభీషణుడి రూపంలో రామ, లక్ష్మణులను చేరిన మైరావణుడు, వారిద్దరినీ చిన్న ప్రతిమలుగా మార్చి, తన బట్టల చాటున దాచి, పాతాళలంకకు చేరుకుని, రామలక్ష్మణులను చంద్రసేనకు చూపించి, "ఇదుగో నీ రాముడు! ఇతడు అతని తమ్ముడు. వీళ్ళిద్దరినీ రేపు కాళికి బలి ఇచ్చి, నిన్ను పెళ్ళాడేస్తాను," అని వికటాట్టహాసం చేసి, రామ, లక్ష్మణులను బంధించాడు.

హనుమంతుడు పడమటి సముద్రంలోకి చొచ్చుకుపోయి తామర మొగ్గ ఆకారంలో ఉండి, నిప్పుకణికలా గా మెరిసే పర్వతాన్ని చూశాడు. హనుమంతుడు ఆ పర్వతశిఖరాన్ని చేరి, అక్కడ ఉన్న సన్నని బిలాన్ని చూసి, సూక్ష్మ రూపంలో ఆ బిలంకుండా దిగి వెళ్ళాడు. ఆ బిలం అతన్ని పాతాళలంక సింహ ద్వారంవద్దకు తీసుకుపోయింది.

ఆ ద్వారాన్ని మహాబలుడైన యువకుడొకడు కాపలా కాస్తున్నాడు. బల పరాక్రమాలు ఉట్టిపడే ఆ ద్వారపాలకుణ్ణి చూసి, హనుమంతుడు ఎంతో ముచ్చటపడ్డాడు. ఆ క్షణంలో అతడికి, ఆ యువకుడి మీద ఒక విధమైన వాత్సల్యం కలిగింది.

హనుమంతుడు సూక్ష్మ రూపంలో వున్నా, ద్వారపాలకుడైన యువకుడు



పెద్దగా నవ్వుతూ, "ఓరీ మాయావీ! నే నెవ్వడనుకుని, నాతో యుద్ధానికి వచ్చావు? నా పేరు మత్స్యవల్లభుడు. వీరాగ్రేసరుడైన హనుమంతుడు, నా తండ్రి. తెలుసా?" అన్నాడు.

యువకుడిలా అనగానే హనుమంతుడికి ఆశ్చర్యంతోపాటు కోపం కూడా కలిగింది. అతడు పళ్ళుకొరుకుతూ "ఓరీ, చేపలవాడా! జగమెరిగిన బ్రహ్మచారి హనుమంతుడు, నీ తండ్రా? ఇలాంటి అబద్ధపు కూతలు కూసినందుకు, నీకు చావు తప్పదు!" అంటూ మత్స్యవల్లభుడి మీదికి లంఘించాడు.

అతణ్ణి గుర్తించి, "ఎవడవురా నువ్వు? నా కన్నుగప్పి సింహద్వారం దాటి పోవాలనుకుంటున్నావా? ఇదిగో, నీకు చావు మూడింది!" అంటూ పిడికిలి బిగించి, హనుమంతుడి మీద కలబడ్డాడు.

ద్వారపాలకుడి బల పరాక్రమాలు చూసి హనుమంతుడు ఆశ్చర్యపోతూ, "వీడెవ్వడోగాని, నాతోసమానంగా పోరాడగలుగుతున్నాడు. ఇలాంటి వాణ్ణి కొంచెం మరిపించి, హతం చేయాలి," అనుకుంటూ, అలిసిపోయిన వాడిలా చతికిలబడ్డాడు.

తన శత్రువు నీరసించి పోయాడనుకుని, ద్వారపాల యువకుడు ఉత్సాహంతో

హనుమంతుడు బలమైన పిడికిటి పోటులతో యువకుణ్ణి చంప చూస్తున్నంతలో, వెనకనుంచి, "స్వామీ, తొందరపడకండి, ఆగండి!" అన్న కేక వినిపించింది.

హనుమంతుడు చప్పున తల తిప్పి చూశాడు. మెరుపులాంటి సౌందర్యవతి ఒకామె అతడి కేసి పరుగు పరుగున వస్తూ కనిపించింది. ఆశ్చర్యపోతూ నిలబడిన హనుమంతుడి పాదాలకు నమస్కరించి, ఆమె, "వాడు చెప్పింది సత్యమే! నా పేరు సువర్చలాదేవి. దక్షిణ సాగరుడు నా తండ్రి. అసంఖ్యాక జలచరాలకు నేను రాణిని. నన్ను, నీవు ఎరగవుగాని; నిన్ను నేను ఎరుగుదును. ఒకసారి నువ్వు

సముద్రాన్ని లంఘిస్తున్నప్పుడు సింహిక, నీ నీడను పట్టి లాగగా, నువ్వు దానితో పోరాడసాగావు. ఆ సమయంలో నేను మత్స్యశరీరంతో, సముద్రం మీద తేలుతున్నాను. నువ్వు, సింహికను చంపి, నీ నొసటపట్టిన చెమటను వేలితో తీసి విదిలించావు. ఆ చెమట బిందువు, నా నోటిలో పడింది. నేను మింగాను. ఆ కారణంగానే నేను గర్భవతినయి, ఈ మత్స్యవల్లభుడిని కన్నాను. అందువల్ల ఇతడు నీ కుమారుడే!'' అన్నది.

ఆమె మాట ముగించేసరికి, ''హనుమా! సువర్చల చెప్పినదంతా నిజం. మత్స్యవల్లభుడు నీ కుమారుడే!'' అంటూ దివ్యవాణి పలికింది.

ఇంకా ఆశ్చర్య సంభ్రమాలనుంచి తేరుకొనని హనుమంతుడితో, సువర్చలాదేవి ఇలా చెప్పింది: ''మత్స్యవల్లభుడు బాల్యంనుంచే ధైర్యసాహసాలు కలవాడు. మహాపరాక్రమశాలిగా పెరిగి పెద్దవాడవుతున్న అతణ్ణి, మైరావణుడు ఎత్తుకుపోయి, తన బానిసగా చేసుకున్నాడు. నీ దర్శనంతోగాని, వాడికి దాస్యవిముక్తి కలగదని దివ్యవాణి చెప్పింది. నీదర్శనం కలిగింది; మత్స్యవల్లభుడికి ఈనాటితో దాస్యం తొలగిపోయింది.''

''సువర్చల చెప్పినదంతా నిజం. మత్స్యవల్లభుడు హనుమంతుడి కుమారుడే!'' అని దివ్యవాణి మరొకసారి పలికింది.

మత్స్యవల్లభుడు, హనుమంతుడికి ప్రణమిల్లాడు. హనుమంతుడు అతణ్ణి భుజాలుపట్టి లేవనెత్తి, గాఢాలింగనం చేసుకున్నాడు.

సువర్చలాదేవి ఎంతో సంతోషపడిపోతూ హనుమంతుడితో, ''నువ్వు చంద్రసేన దగ్గిరకు వెళ్ళు. మైరావణుడి ప్రాణరహస్యం ఆమెకు తెలును. నీకు అన్నివిధాలా సహాయం చేస్తుంది.'' అని హనుమంతుడికి నమస్కరించి, మత్స్యవల్లభుడిని వెంటబెట్టుకుని, వెళ్ళిపోయింది.





# పగటిదయ్యం

పూర్వం బాగ్దాదులో, అబ్దుల్లా అనే గొప్ప ధనవంతుడుండేవాడు. అతడు దయ్యాల కథలంటే చెవికోసుకునేవాడు. రోజూ ఒక్క దయ్యంకథ అయినా వింటేగాని, అతడికి నిద్రపట్టేదికాదు. దయ్యంకథలు చెప్పేవారికి విలువైన బహుమతులు ఇవ్వబడతాయని నగరంలో చాటింపు వేయించాడు.

బహుమతులను ఆశించి, చాలామంది అబ్దుల్లా దగ్గరకు దయ్యాలకథలు చెబుతామని వచ్చేవారు. అయితే కథల మధ్యలో అతడు, తనకా కథ నచ్చలేదనీ, మరింత వింతగా వుండే కథ చెప్పమనీ వాళ్ళను వేధించేవాడు. ఎవరైనా, తనకలాంటి వింతకథలేవీ రావని వెళ్లిపోయే ప్రయత్నం చేస్తే, అబ్దుల్లా పిచ్చికోపంతో, "ఒరే, పనికిమాలిన వెధవా! కథలు చెప్పడం చేతకానివాడివి, నా దగ్గిరకెందుకొచ్చావు?" అంటూ కొరడాతో చావు దెబ్బలు కొట్టేవాడు.

ఇందువల్ల, అబ్దుల్లాకు రోజురోజుకూ దయ్యాలకథలు చెప్పేవాళ్ళు కరువైపోసాగారు.

ఇలా ఉండగా ఒకనాడు అబ్దుల్లా మధ్యాహ్నభోజనంచేసి, కాస్త కునుకు తీద్దామనుకుంటూండగా, నౌకర్లు ఒకణ్ణి తీసుకువచ్చి, అతడిముందు నిలబెట్టారు. వాడి దుస్తులు బాగా మాసివున్నవి. జుట్టు జడలుగట్టి ఉన్నది. మనిషి ఎండుకట్టెలా బక్కచిక్కి ఉన్నాడు.

అబ్దుల్లా వాణ్ణి నఖశిఖపర్యంతం ఒకసారి పరీక్షగా చూసి, "నిన్ను చూస్తేనే దయ్యంలా ఉన్నావు. పైగా మట్టివాసన. నువ్వు నాకేం వింత దయ్యంకథ చెప్పగలవు?" అన్నాడు.

అరేబియాకథ

''అయ్యా, నా పేరు హమీద్. నా భార్యకూ్కడా మీలాగే దయ్యాలకథలు వినడం సరదా. ఒక రాత్రివేళ తప్పని సరయి, దానికి ఒక భయంకరమైన దయ్యంకథ చెప్పాను. కథ పూర్తవగానే నా భార్య గుండెఆగి చచ్చిపోయింది. తెల్లవారగానే, దాన్ని పాతిపెట్టి, ఇంటికి వచ్చిజరిగిందానికి దుఃఖిస్తూకూర్చున్నాను. అంతలో నా ముందు ఒక మెరుపు మెరిసింది. ఆ మరుక్షణం నా భార్య ప్రత్యక్షమైంది. గోరీలోంచి ఎలా లేచి వచ్చిందా, అని నేను ఎంతో ఆశ్చర్య పోయాను.

నేను ఆశ్చర్యం నుంచి తేరుకునే లోపలే, నాభార్య, 'మీరువద్దన్నా, దయ్యం కథ చెప్పమని హఠం చేసినందుకు, నాకు తగినశాస్తి జరిగింది. మీకు దూరమై పోయాను. నన్ను క్షమించండి!' అన్నది.''

హమీద్ ఇంకా ఏదో చెప్పబోయేంతలో, ''ఆగు! ఇందులో విచిత్రమేముంది?'' అన్నాడు అబ్దుల్లా.

''దయ్యం పట్టపగలు కనిపించడం విచిత్రం కాదంటారా?'' అన్నాడు హమీద్.

అబ్దుల్లా ఒకసారి తన పొడవాటి గడ్డంలో వేళ్ళు దూర్చి ఆలోచిస్తూ, ''విచిత్రమే అనుకో! అయినా, నువ్వు చెప్పింది నమ్మను. దయ్యాలు పగలు కనిపించవు,'' అన్నాడు అబ్దుల్లా.

''ఎందుకు కనిపించవు? నేను నెల క్రిందట, మీరిస్తానన్న బహుమతి ఆశించి, దయ్యాల కథ చెప్పడానికి వచ్చాను. నా కథ బాగోలేదంటూ కొరడాతో నన్ను చావు దెబ్బలు కొట్టావు. వారంపాటు మంచాన పడి, తరవాత సమాధి అయ్యాను,'' అంటూ హమీద్ తన తల తీసి, రెండు చేతులతో పట్టుకుని, బంతిలా ఎగరేసాడు.

అది చూసి అబ్దుల్లా, కీచుమంటూ పెద్దగా అరిచి దభీమంటూ నేలమీద పడ్డాడు. ఆ తరవాత ఎవరైనా దయ్యాల మాట చెబితే కసురుకునేవాడు. అతడికి దయ్యాలకథల పిచ్చి ఎలా కుదిరిందో ఎవరికీ తెలియదు.





# కోడలు-ధనం

గౌరమ్మకు ఒక్కగానొక్క కొడుకు షణ్ముఖుడు. భర్తపోయాక, వాడి నామె పెంచి పెద్దచేసింది. తన మేనకోడలు సీతతో వాడికి పెళ్ళిచేయాలని, ఆమె మనసుపడింది. కానీ షణ్ముఖుడా ఊళ్ళోనే వుండే పద్మ అనే పిల్లంటే ఇష్టపడ్డాడు.

పద్మ తన కొడుకును వల్లో వేసుకున్నదని గౌరమ్మ అనుమానం. అందుకని ఆమె ఒకరోజున తనే వెళ్ళి పద్మను కలుసుకున్నది. పద్మ కలిగినవారి పిల్ల. ముట్టుకుంటే కందిపోయేలా వుంటుంది. గౌరమ్మ, పద్మను పలకరించి, "మేమేం వున్నవాళ్ళం కాదు. నా కొడుకు మంచి వాడు కదా కొంగున ముడివేసుకుని తిరగొచ్చునని, వాణ్ణి వల్లోవేసుకున్నావు. అవునా ?" అని అడిగింది.

"అదేం లేదత్తయ్యా! మేమిద్దరం ఒకరినొకరు బాగా అర్థంచేసుకుని ప్రేమించుకున్నాం. మీ ఆశీర్వాదముంటే, మా పెళ్ళి జరుగుతుంది." అన్నది పద్మ.

"నీకు నిజంగా మావాడి మీద అంత ప్రేమ వుంటే, పుట్టింటినుంచి రాగి కానీ కూడా తెచ్చుకోకు. నా ఇంట్లో పనులన్నీ నువ్వే చేయాలి. ఇష్టమేనా ?" అని ప్రశ్నించింది గౌరమ్మ.

ఇష్టమే నన్నట్లు తలూపింది పద్మ.

తర్వాత ఇంటికి వచ్చి గౌరమ్మ కొడుకును పిలిచి, "నువ్వు సీతను కాదని పద్మను పెళ్ళిచేసుకుంటే డబ్బుకోసం ఆశపడ్డావని చెడ్డపేరొస్తుంది. అది నేను భరించలేను. కాబట్టి సీతను కాదనకు," అన్నాడు.

షణ్ముఖుడు తల అడ్డంగా ఊపి, "అలా అయితే, నాకొక పేదింటి అమ్మాయిని చూసి పెళ్ళి చెయ్యి. సీతను మాత్రం నేను పెళ్ళాడను. పద్మను తప్ప ఇంకెవరిని చేసుకున్నా నాకు సంతోషంగా

జొన్నలగడ్డ రామలక్ష్మి



వుండదు. అయినా నీ మాట కాదనను, ఒక్క సీత విషయంలో తప్ప!'' అన్నాడు.

గౌరమ్మ, కొడుకు మాటలకు తృప్తి పడి, ''అయితే పద్మనే పెళ్ళిచేసుకో. కానీ పెళ్ళయ్యాక ఆమె పుట్టింటినుంచి ఏ సాయమూ ఆశించకూడదు,'' అన్నది.

షణ్ముఖుడు సరేనన్నాడు. వాడి పెళ్ళి జరిగి పద్మ కాపరానికి వచ్చింది. వెంటనే కొడుకు ముందే గౌరమ్మ, కోడలికి తన షరతులు చెప్పింది.

పద్మ అంతా విని, ''అత్తయ్యా! నువ్వే పని చెప్పినా కిమ్మనకుండా చేస్తాను. అయితే ఎవరైనా చూస్తూంటే, నేనేపనీ చేయలేను. కాబట్టి నేను పనులు చేస్తున్నప్పుడు తలుపులు వేసుకుని, ఒక్కతెనూ కూర్చుని చేస్తాను,'' అన్నది.

గౌరమ్మ ఏదో అనబోయిందిగానీ, షణ్ముఖుడా షరతులు న్యాయంగా వున్నవనడంతో వూరుకున్నది. పద్మ ఎలా పనులు చేస్తున్నదో తెలియదుకానీ— ఆమె వచ్చాక గిన్నెలు తళతళ మెరిసి పోతున్నవి. ఇల్లు తీర్చిదిద్దినట్లుంటున్నది. వంట విషయంలో, షడ్రసోపేతంగా అందరూ ప్రతిరోజూ విందుభోజనం చేస్తున్నారు. రాత్రిసమయంలో కోడలు పాదాలొత్తడంవల్ల, గౌరమ్మకు ఒళ్ళుతెలియని నిద్రపడుతున్నది.

అలా కొంతకాలం జరిగాక, గౌరమ్మ అన్న శివనాగయ్య చెల్లెలింటికి వచ్చి, తన కూతురు సీతకు పెళ్ళిసంబంధం కుదిరిందని చెప్పాడు.

గౌరమ్మ చాలా సంతోషించి, అన్నను వివరాలడిగింది.

దానికి శివనాగయ్య నిష్ఠూరంగా, ''అంతగా అయినవాళ్ళు డబ్బుకాశపడి మమ్మల్ని కాదన్నాక, గొప్ప సంబంధాలేం దొరుకుతాయి? ఏదో గంతకు తగ్గ బొంత!'' అన్నాడు.

గౌరమ్మ నొచ్చుకుని, పెళ్ళివిషయంలో తాను కోడలికి విధించిన షరతులన్నీ చెప్పింది. ఆమె అన్న అంతా విని,

"ఇవన్నీ ఎదుటివాళ్ళ కళ్ళుగప్పటానికి చెప్పే మాయమాటలు. నీ ఇల్లు చూస్తూంటేనే తెలిసిపోతున్నది—నీ కోడలు మొత్తం పనులన్నీ పనివాళ్ళచేత చేయిస్తున్నదని," అనేశాడు.

గౌరమ్మ తెల్లబోయింది. అన్న చెప్పినట్టు మర్నాడామె రహస్యంగా కోడలిమీద నిఘావేసి చూస్తే, అసలు రహస్యం బయటపడిపోయింది. పద్మ తలుపులు వేసుకున్నాక, మారుతలుపు తీసి పనిమనుషుల్ని లోపలకు రప్పిస్తున్నది. వాళ్ళల్లో ఒకరు గిన్నెలు తోముతారు. ఒకరు బట్టలుతుకుతారు. ఒకరు ఇల్లూడ్చుతారు. ఒకరు వంటచేస్తారు! ఆ సమయంలో పద్మ తీరుబడిగా కూర్చుని బొమ్మలు వేసుకుంటున్నది.

ఈ జరిగిన మోసం తెలిశాక గౌరమ్మ ఊరుకోలేదు. ఆ రాత్రి కొడుకు ఇంటికి వచ్చాక, కోడల్ని పిలిచి తను చూసినదంతా చెప్పి సంజాయిషీ అడిగింది.

పద్మమాత్రం తడబాటు చూపకుండా, "అత్తయ్యా! నీకు నేనే పని చేయాలని వుంది. ఎవరిచేతనైనా చేయించడం నీకు నచ్చదా? అయితే ఇంతకాలం పని బాగున్నదని మెచ్చుకున్నావు కదా! మరి, ఇప్పుడు నీకొచ్చిన సమస్యేమిటి?" అన్నది.



దానికి గౌరమ్మ కోపంగా, "ఇంతమంది పనివాళ్ళు, పనిచేసి పోతున్నారంటే, వాళ్ళకు నువ్వు డబ్బు బాగా ఇస్తూండాలి! ఆ డబ్బు నీకెక్కడిది? నీ పుట్టింటినుంచి రాగికానీ కూడా తేరాదని, నా షరతు కదా!" అన్నది.

"అయ్యో, అత్తయ్యా! ఇప్పుడు కూడా నేను నా పుట్టింటినుంచి రాగికానీ కూడా తేవడంలేదు. పనివాళ్ళు పనులు చేసుకుపోతూంటే, నేను బొమ్మలు వేస్తున్నాను కదా! వాటిని మీ అబ్బాయి పట్నంలో అమ్మి డబ్బు తెస్తున్నాడు," అన్నది పద్మ.

"అయితే మాత్రం! ఇప్పుడు మనం రోజూ విందుభోజనం చేస్తున్నాం!

అన్నింటికీ నీ బొమ్మల డబ్బే సరి పోతున్నదా?" అంటూ గద్దించింది గౌరమ్మ.

అప్పుడు షణ్ముఖుడు, "అమ్మా! ఎలాగూ వంటమనిషి వున్నది. విందు భోజనమెందుకు చేయకూడదని, నేనను కున్నాను. అందుకే ఇదివరకటి కంటే, ఎక్కువగా కష్టపడి డబ్బు సంపాయిస్తు న్నాను. భార్యా, తల్లి సుఖపడుతూంటే, వయసులో వున్నప్పుడు కాక, వయసు మళ్ళాకకష్టపడగలనా?" అన్నాడు.

ఈ మాటలు వినగానే, అక్కడే వున్న గౌరమ్మ అన్నకు ఉక్రోషం వచ్చి, "అంతేలే! నా కూతురైతే ఇలా బొమ్మలు వేసి డబ్బు సంపాయించనూ లేదు, మొగుడుచేత మరింత పని చేయించనూ లేదు. అక్కయ్యా! నువ్వు డబ్బు కావా లనుకునే, ఈ పద్మను కోడలిగా తెచ్చు కున్నావు. ఇప్పుడు నా మాట కాదను చూద్దాం," అన్నాడు.

గౌరమ్మ శాంతంగా, "కోడలి పుట్టింటి డబ్బు వద్దన్నాను కానీ, కోడలే ధనమైతే కాదనలేను. తనకున్న విద్యతో నాలుగు డబ్బులు సంపాదించగలిగి, తన భర్తచేత ఎక్కువ సంపాదన చేయించగలిగి, పెద్ద వారిని సంతోషపెట్టే కోడలుండడం, ఎవరికైనా అదృష్టం! నువ్వు కూడా సీతకు మంచి విద్యలు నేర్పించి, అత్త వారు మెచ్చుకునేలా తయారుచెయ్యి." అని అన్నను మందలించి పంపేసింది.

పద్మ, షణ్ముఖుడు గౌరమ్మ కాళ్ళ మీద పడి తమ తప్పును మన్నించ మన్నారు.

"మీవల్ల తప్పేం జరగలేదు. తప్పు నాది. చిత్రకళ చేతిలోవున్న కోడలిచేత ఇంటి పనులు చేయించాలనుకున్నాను. మనసువిప్పి అన్నీ మాట్లాడుకుని వుంటే, పనివాళ్ళచేత రహస్యంగా పని చేయించ డమూ, వాళ్ళకు ఎక్కువగా డబ్బివ్వ డమూ అవసరపడేది కాదు. మీరిద్దరూ నా కొడుకు, కోడలు కావడం నా అదృష్టంగా భావిస్తున్నాను." అంటూ ఇద్దర్నీ దగ్గిరగా తీసుకుంది గౌరమ్మ.









# కబుర్లు

## ఒరుగుతూన్న గోపురం!

ప్రపంచ వింతలలో ఒకటిగా ప్రసిద్ధిగాంచిన ఇటలీలోని పీసాగోపురాన్ని చూడడానికి రోజూ వేలాదిమంది ప్రజలు వస్తూ వుంటారు. యాత్రికులను ఆకర్షించడానికే దీనినిలా ఒరుగుతున్నట్టు నిర్మించారని ఆ రోజుల్లోనేకొందరు చెప్పుకునేవారు. అయితే, ఇటీవల పీసాగోపురం సమీపంలో జరిగిన తవ్వకాలలో అసలు విషయం బయటపడింది. ఈ గోపురం సమీపంలో ఒక పెద్ద గొయ్యి ఉండేదనీ, 1173 వ సం॥లో గోపురనిర్మాణం ప్రారంభించడానికి పదేళ్ళకు పూర్వం దానిని పూడ్చారనీ తెలిసింది. ఆ గోతిలోమన్ను, కిందికి దిగడం ఆరంభించడంవల్లే గోపురం ఒరగడం జరుగుతున్నదని తెలియవచ్చింది. ఈ గోపురం వాలు ఇప్పుడు కూడా సంవత్సరానికి 1 సెం॥ మీ॥ పెరుగుతున్నది!

## ఐదేళ్ళపాప భూగోళ పరిజ్ఞానం!

ఒకటవ తరగతి చదువుతూన్న మద్రాసుకు చెందిన ఐదేళ్ళ పాప శ్రీవిద్య భూగోళంలో అద్భుతమైన ప్రతిభను కనబరుస్తున్నది. ఇంతకూ ఆ పాపకు భూగోళం పాఠ్యాంశం కూడా కాదు. అట్లాస్‌లో ప్రపంచంలోని ముఖ్యమైన పట్టణాలనూ, రాజధానీనగరాలనూ, దేశాలనూ ఆ అమ్మాయి క్షణాలలో చూపుతుంది. ఏ దేశానికి ఏ పట్టణం రాజధానో అడిగితే ఆ క్షణమే సరైన సమాధానం చెబుతుంది. ఆమె రెండేళ్ళ పాపగా ఉన్నప్పుడు మామయ్య ఒళ్ళో కూర్చుని అతడు చూసే 'అట్లాస్' ను పరిశీలించి చూడడం నుంచి ఆమెకు భూగోళంపట్ల ఆసక్తి ఏర్పడింది. ఇటీవల ఆ అమ్మాయిని 'నేషనల్ జాగ్రఫిక్ సొసైటీ ఆఫ్ యు.ఎస్.ఏ'లో జూనియర్ మెంబర్‌గా చేర్చుకున్నారు!

## మరపురానిమంచిపని!

ఇంగ్లాండుకు చెందిన ప్రముఖ ఫుట్‌బాల్ క్రీడాకారుడు పాల్ ఎడ్మండ్స్, గోల్‌కీపర్‌గా మంచి పేరున్నవాడు. 28 సంవత్సరాల ఆ క్రీడాకారుడు ఆగస్టు 11వ తేదీ ఆట ముగించి ఇంటికి తిరిగి వస్తూవుండగా కేలీ అనే రెండేళ్ళపాప 12 మీటర్ల (40 అడుగులు) ఎత్తయిన కిటికీ నుంచి వేలాడుతూ వుండడం చూసి, మెరుపు వేగంతో వెళ్ళి జారిపడుతున్న ఆ పాపను కాపాడాడు. ఆ పాపాయి తల్లి కారేన్ గ్రాంట్ "ఆ యువకుడు, మాకు మహావీరుడు!" అన్నది ఎంతో కృతజ్ఞతతో.



# గాడిద జోస్యం

సువర్ణానదీ తీరాన ఒక గ్రామంలో ఒక జ్యోతిష్కుడుండేవాడు. ఆయన పంచాంగాలు గుణించటంలో ఆ చుట్టుపక్కల మిగిలిన సిద్ధాంతులకన్న చాలాగొప్పవాడని పేరు వచ్చింది. తరవాత జాతకాలు రాయటంలో అంతటివాడు లేడని అందరూ అనసాగారు.

సిద్ధాంతిగారి ఖ్యాతి క్రమంగా రాజధానికి పాకింది. అక్కడ ఉండే రాజోద్యోగులంతా కలిసి ఆయనను పట్టుబట్టి రాజధానికి రప్పించారు. కొద్దికాలంలోనే సిద్ధాంతిగారికి రాజాశ్రయంకూడా దొరికింది. ఆయన చెప్పిన జోస్యానికి తిరుగు ఉండేదికాదు.

క్రమంగా సిద్ధాంతిగారు అధికారుల అనుగ్రహమూ, బోలెడంత డబ్బూ సంపాదించుకుని, నదీతీరాన తన స్వగ్రామంలో అనేక వందల ఎకరాల భూమికి హక్కుదారయినాడు. పంటలు వచ్చే తరుణంలో మాత్రం సిద్ధాంతిగారు స్వగ్రామం వెళ్ళి, చేలు కోయించి, కుప్పలు వేయించి, నూర్పిళ్ళు చేయించి, ధాన్యం కొట్లలో వేయించి,దానిఅమ్మకానికి ఏర్పాట్లు పూర్తి చేసుకునిరాజధానికి తిరిగిపోతూండేవాడు.

ఒక ఏడాయన ఈ విధంగానే తన గ్రామం వెళ్ళాడు. కుప్పలన్నీ నూర్చి ధాన్యమంతా పొలాల్లోనే రాశి పోశారు. మధ్యాన్న భోజనం అయ్యాక ఒక కునుకు తీసి లేచి, సిద్ధాంతిగారు చల్లగాలికి వసారాలో వచ్చి కూచున్నాడు.

ఈ సమయానికి ఊరిరజకుడు ఉతికిన బట్టలు గాడిదపైన వేసుకుని ఇంటికి పోతూ, సిద్ధాంతిగారిని చూసి ఆగి, "ఏం, బాబూ? ధాన్యమంతా పొలంలోనే ఉన్నట్టున్నది. త్వరగా ఇల్లు చేర్పించండి! ఇంకా చూస్తారేం!" అన్నాడు.

''చేర్పిస్తాను. ఇప్పుడేం తొందర వచ్చిందిరా?'' అన్నాడు సిద్ధాంతిగారు నెమ్మదిగా.

''తొందర కాకేమండీ? ఇంకో గంటలో తుఫాను ముంచుకొస్తుంటేనూ?'' అన్నాడు రజకుడు ఆదుర్దాగా.

సిద్ధాంతిగారు నవ్వి. ''నీ జోస్యం అఘోరించినట్టే ఉంది! ఈ కార్తెలో వానలే ఉండవుగదా. తుఫాను రావట మేమిటి? అదీగాక ఆకాశం చూడు, ఎంత నిర్మలంగా ఉందో! ఎక్కడా ఒక్క మబ్బు తునక లేదు. మందమారుతం వీస్తున్నది! అయినా, తెలిసీ తెలియని విషయాలు పెద్దలతో ఎన్నడూ చెప్పకు!'' అన్నాడు.

''మీ మంచికోరే చెబుతున్నాను. కార్తెల సంగతి నేనెరగనుగాని, ఇంకో రెండు గడియలలో తుఫాను రావటం ముటుకు అక్షరాలా నిజం! వెంటనే బళ్ళను పొలానికి తోలించి ఒక్క గింజ దిగబడకుండా ధాన్యమంతా ఇంటికి తెప్పించుకోండి. లేకపోతే. బంగారమంటి పంట నిష్కారణంగా పాడైపోతుంది!'' అంటూ వాడు తన గాడిదను గట్టిగా అదిలించి ముందుకు సాగిపోయాడు.

సిద్ధాంతిగారు వాడి అమాయకత్వానికి నవ్వుకుంటూ మళ్ళీ ఒక్కసారి ఆకాశాన్ని కలయజూశాడు. పడమటగా చిటికెన వేలంత మబ్బు ఒకటి కనిపించింది. మరి కాస్సేపటికల్లా, అడవి ఏనుగుల మంద



లాగా కారుమేఘాలు వాయువేగంతో అన్ని వైపులనుంచీ వచ్చి కమ్ముకున్నాయి. సూర్యుడుఎక్కడ ఉన్నదీతెలియరాలేదు. ప్రపంచం చీకటిపడినట్టయి పోయింది. పెద్ద పెద్ద మానులను కూకటి వేళ్ళతో సహా పెకలించగల హోరుగాలి సాగింది. ఆకాశాన ఉరుములూ, మెరుపులూ సాగి వాన ఆరంభమయింది.

సిద్ధాంతిగారికి ఏమి చేయాలో తోచ లేదు. రజకుడుచెప్పినప్పుడే ధాన్యం చేర వేసుకునివుంటే నష్టం ఉండేదికాదు. కాని పంచాంగం ప్రకారం ఈ సమయంలో వానలుండడానికి వీలులేదుగనక సిద్ధాంతి గారు వాడి మాట ఏమాత్రం లక్ష్య పెట్టలేదు.

''అన్నట్టు ఈ తుఫాను వస్తుందని రజకుడికి గంటకిందటే ఎలాతెలిసింది?'' అనిసిద్ధాంతిగారుఆశ్చర్యపడ్డాడు.తుఫాను కాస్త తగ్గగానే ఆయన రజకుడి ఇంటికి పరిగెత్తి వెళ్ళి, ''ఒరే, నువ్వు చెప్పినట్టే చిత్రంగా వాన వచ్చిందే! నీకు తప్పక జోస్యం తెలిసి ఉండాలి. ఎవరిదగ్గిర నేర్చు కున్నావురా ?'' అని అడిగాడు.

''మరెవరో నా, బాబూ! నాగాడిదే నాకు జోస్యం చెబుతుంది. దాని ముందు పంచాంగాలు పనికిరావు. ఇంకో మూడు నాలుగు గడియల్లో వాన రాబోతుందనగా దానివంటిమీద రోమాలన్నీ నిలబడతాయి. అది చెవులూ, కళ్ళూ పైకితిప్పి మనకు విన పడని వానకోసం ఆలకిస్తుంది. తరవాత తోకముడిచి అటూఇటూ చిందులుతొక్కు తుంది! దాని జోస్యానికి తిరుగులేదు, బాబూ!'' అన్నాడు రజకుడు.

సిద్ధాంతి వెళ్ళిపోతూ, ''ఒరే, నీకు పుణ్యం ఉంటుంది. ఇవాళ మనమధ్య జరిగిన సంగతి ఎవరికీ చెప్పకు. నా పరువు కాస్తా పోతుంది!'' అని రజకుణ్ణి బతిమాలు కున్నాడు. కాని ఈ సంగతి కొన్నాళ్ళకు అందరికీ తెలియనే తెలిసింది. సిద్ధాంతి గారి దగ్గిర జరగబొయ్యే విషయాలు తెలుసుకునేందుకు వచ్చేవారు క్రమంగా తగ్గిపోయారు.



ప్ర కృ తి వింతలు



## మొసళ్ళ మంచితనం!

మొసళ్ళు కడుపునిండా తిని నీళ్ళనుంచి వెలుపలికి వచ్చి పగటి పూట ఎండలో సేద తీరుతున్నప్పుడు ఏ ప్రాణికీ హాని చేయవు. అప్పుడు వాటి శరీరం మీది క్రిమికీటకాలను పట్టి తినడానికి చిన్న చిన్న పిట్టలు వాటి మీద వాలుతాయి. కొన్ని పిట్టలు, బాగా తెరిచిన వాటి నోటిలోకి కూడా వెళతాయి. అయితే, మొసళ్ళు నీళ్ళలోకి దిగితేచాలు, అవి రాత్రులలో చేపలు, కప్పలు మొదలైన జలచరాలనే కాదు; నీళ్లుతాగడానికి వచ్చే ఇతర జంతువులను కూడా పట్టి తినేస్తాయి. తినడానికి ముందు వాటిని నీళ్లలో బాగా ముంచుతాయి. అయితే, మొసళ్ళుఆహారాన్ని నమిలి మింగలేవు!



## వెనక్కు ఎగిరే పక్షి!

గోటెమాల జాతీయపక్షి - క్వెట్‌జాల్! ప్రపంచంలోని పక్షులలోకెల్లా క్వెట్‌జాల్ మగపక్షులు చాలా అందమైనవి. వీటి శరీరం దాదాపు 35 సెం.మీ. పొడవు వుంటుంది. తోక దానికి రెండింతలు ఉంటుంది. ఈ పక్షులు కొమ్మలపై నుంచి సరాసరి ముందుకు ఎగరడానికి బదులు, మొదట కాస్త వెనక్కు ఎగిరి ముందుకు వెళతాయి. ఇదే వీటి ప్రత్యేకత. పొడవాటి తోకలు కొమ్మలకు తగలకుండా ఉండడానికే ఇవి ఇలా ఎగురుతాయి. ఆడపక్షులు చెట్టు తొర్రలలో గుడ్లు పెడతాయి. ఆ గుడ్లమీద కూర్చున్న మగపక్షుల తోకలు మరీ పొడవుగా కనిపిస్తాయి.

## వెలుగునిచ్చే ప్రాణులు!

వెలుగునిచ్చే కీటకాలలో మిణుగురులు ముఖ్యమైనవి.తమ జాతి పురుగులను ఆకర్షించడానికి వీటి వెలుగు ఉపయోగపడుతుంది. అయితే 'లాంతరు కళ్ళ' చేపలనే ఒక రకం చేపల నుంచి వెలువడే వెలుతురు – వాటి కళ్ళకు దిగువ మడతలలో చేరే ప్రకాశంగల బాక్టీరియా నుంచి వస్తుంది. బ్రెజిల్ దేశానికి చెందిన కొందరు ఆదిమవాసులు ఒకరకం పుట్టగొడుగులను వెలుగుకోసం ఉపయోగిస్తారు. వీటి గొడుగు భాగం అడుగున వెలుగునిచ్చే పొర వుంటుంది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చుట్టివస్తాం, ధరిత్రి! రెండవ ఫోటో: చిత్రమైన మైత్రి!

పంపినవారు: ఎం. లలిత, C/o వి. వీరభద్రం, H. No. 387, ఎక్సైజు కాలనీ, సుబేదారి, హనుమకొండ–506 001 (ఆం.ప్ర.)

బహుమతి మొత్తం రు. 100/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---